*Issued 27—5—1957.*




# ANDHRA LEGISLATIVE ASSEMBLY
## DEBATES

# OFFICIAL REPORT

### FRIDAY, THE 2ND MARCH, 1956

### VOLUME II - No. 5.

*CONTENTS*



PRINTED BY SREE KRISHNA PRINTING PRESS, KAKINADA
FOR THE SUPERINTENDENT,
ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL.

PRICE, 6 Annas.

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Friday the 2nd March, 1956.*

The House met in the Assembly Hall, Kurnool, at nine of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

[Note :—An arterisk * at the commencement of a speech denotes revision by the Member]

## THE ANDHRA OBJECTIONABLE PERFORMANCES PROHIBITION BILL, 1956—(Contd.)

### *CLAUSE 16.*

**Mr. SPEAKER** :—The motion before the House is—

That clause 16 do stand part of the Bill.

**Sri P. SUNDARAYYA**:—ప్రభుత్వానికి ఎన్నో చట్టాలు ఉన్నప్పటికినీ, ఈ చట్టాన్ని మాత్రం repeal చేయవలసిన అవసరమేమిటో అర్థంకాలేదు. అది కూడ Statute Book లో ఉంటే, వాటికి తోడుగాఉంటుంది కాబట్టి ఈ సలహా నైనా వారు అంగీకరిస్తారేమో అనుకొంటాను.

**The Hon. Sri N. SANJEEVA REDDI** :—Atomic days లో మేము కత్తులతో యుద్ధముచేస్తామంటే ప్రపంచం ఎక్కడైనా ఒప్పుకొంటుందా? Atom bombs వచ్చినప్పుడు, మిగతావన్నీ they go by pass. బలవత్తరమైనవి వచ్చినప్పుడు పనికిమాలినవి తీసివేయడం న్యాయము. కాబట్టిదీనిని తీసివేస్తున్నాము.

The motion was put and carried.

### *CLAUSE 2.*

### SUB-CLAUSE (2)

**Sri P. SUNDARAYYA** :—Sir, I move the following:

*Delete* the words 'is likely to'.

The amendment was duly seconded.

**The Hon. Sri N. SANJEEVA REDDI** :— ఈ పదాలు ఇక్కడ చాలాచోట్ల ఉన్నాయి. ఇప్పుడు మనము pass చేసినవాటిలో "is likely to..." అనేదికూడ ఒప్పుకొన్నాము. అదిలేకపోతే కుదురదు.

**Mr. SPEAKER** :—Amendment moved-

*Delete* the words 'is likely to'.

**Sri P. SUNDARAYYA** :— అధ్యక్షా, ఈ బిల్లుకు సంబంధించినంత వరకు "is likely to" అనే పదాలు ఇక్కడ ఉంచమనిగాని, తీసివేయమనిగాని ఇదివరకు ఎక్కడా సవరణ రాలేదు. ఇప్పుడే మొదటి పర్యాయము ఇది రావడము జరుగుతున్నది. Objectionable purposes అంటే ఏమిటో వివరించేడానికోసం, అది ప్రభుత్వముమీద ద్వేషము, లేక విద్రోహము మొదలైనవి కలిగించేదనిగాని, కలిగించేదానికి అవకాశముంటుందనిగాని అనుకొనేటటువంటిది అని ఉన్నది. ఆవిధంగా అవకాశముంటుందని అనుకొనే విధముగా కాకుండా, "about to be conducted" అని ఉంటే "is likely to lead to breach of peace" అని చెప్పాడు.

The Hon. Sri N. SANJEEVA REDDI :— "The District Collector, may if he is satisfied that any performance conducted or about to be conducted is an objectionable performance likely to lead to breach of peace......" అని ఉంది. ఇది సరిగానే ఉంది.

Sri P. SUNDARAYYA :— "If it incites or encourages" అని కూడా ఉన్నది. అందుచేత దానికి, దీనికి చాలా భేదమున్నది. కాబట్టి "is likely to" అనేటటువంటిది తొలగించాలి అని నేను కోరుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఇది లేకపోతే మనము ముందుకే prevent చేయడానికి వీలుండదు.

We will have to wait for the action. That amounts to say that until the results are shown by practice, we cannot ban it. If we know that there is a particular drama depicting some personality whereby there is likely to be some danger if that is enacted, am I to wait for the drama to be enacted and then take action ? It is not possible.

ఈ నాటకము వేస్తే దెబ్బలాట జరుగుతుంది. పలాని వారిని తిడుతూ ఉన్నారు, అని తెలిసిన తరువాత కూడ prevent చేయకపోతే, the whole bill will become infructuous.

Mr. SPEAKER :—The question is

Delte the words 'is likely to'.

The motion was lost.

The Hon. Sri N. SANJEEVA REDDI :— I move Sir, the amendment given notice of to explanation 1.

For explanation I, substitute the following explanation :—

"Explanation I :—A performance shall not be deemed to be an objectionable performance on the ground only that in the course thereof words are uttered, or signs or visible representations are made, expressing disapprobation or criticism of any law or of any policy or administrative action of the Government with a view to obtain its alteration or redress by lawful means ; and a performance in which words are uttered or signs or visible representations are made, pointing out, with a view to their removal, matters which are producing, or have a tendency to produce. feelings of enmity or hatred between different sections of the people of India shall not be deemed to be an objectionable performance within the meaning of this clause."

Mr. SPEAKER :—The question is :

For Explanatiuo I, substitute the following Explanation :—

"Explanation I :—A performance shall not be deemed to be an objectionable performance on the ground only that in the course thereof words are uttered, or signs or visible representations are made, expressing disapprobation or criticism of any law or of any policy or administrative action of the Government with a view to obtain its alteration or redress by lawful means; and a performance in which words are uttered or signs or visible representations are made, pointing out, with a view to their removal, matters which are producing or have a tendency to produce, feelings of enmity or hatred between different sections of the people of India shall not be deemed to be an objectionable performance within the meaning of this clause."

The motion was carried.

Sri PILLALAMARRI VENKATESWARLU :—Sir, I move—
Add the following as Explanation V to Sub-clause (vi) of clause 2 (2).

"Explanation V :- A performance shall not be deemed to be objectionable on the ground of promoting feelings of enmity or hatred between different sections of the people of India if it is intended mainly to better the economic status of any section or promoting unity of any section of the people.

అధ్యక్షా, ఈ amendment యొక్క అవసరము, ఈ definitions లోని నాల్గవ definition చదివితే బాగా బోధపడుతుంది. "Promoting feelings of enemity or hatred between different sections of the people of India" అని ఉన్నది. అంటే వివిధవర్గాల ప్రజానీకముమధ్య ద్వేషాన్ని రెచ్చగొట్టేటటు వంటి వాటిని నిషేధించవచ్చు అనేదానికి అర్థము అవుతున్నది. ద్వేషాన్ని రెచ్చ గొట్టటమంటే ఏమిటి? ఈనాడు కార్మికులకోసమో, రైతులకోసమో, జమీం దార్లకు రైతులకు మధ్య, కార్మికులకు పెట్టుబడిదార్లకు మధ్య feelings ఏవైనా ఉంటే, అవి రెచ్చగొట్టటము అనేదానిక్రిందకుకూడ వస్తుంది. అంటే మామూలు ప్రజానీకము యొక్క ఆర్థికసమస్యలు పరిష్కరింప జేసుకోటానికి చట్టబద్ధముగా నైనాసరే చేసుక్కోటానికి ఏమైనా అవకాశము ఉంటుందా అని అంటే, ఆ వున్న టువంటి కొద్ది అవకాశముగూడ యీ బిల్లుద్వారా తీసివేయడము జరుగుతున్న దన్నమాట. అందువల్ల, యీ బిల్లుయొక్క main purpose, ఏదో obscene language ఉన్నదని, ఏదో గ్రూపులమధ్య తగాదాలు రెచ్చగొట్టుతుంది అని, అం దువల్ల యీ బిల్లును తీసుకునివస్తున్నామని ఒకప్రక్కన చెబుతూ, రైతులు, కూలీలు వారియొక్క ఆర్థిక సమస్యలను గురించి ప్రచారము చేసుకోటానికిగాను, ఏవైనా బుర్రకథలువ్రాస్తే, అందువల్ల రైతులకు, జమీందార్లకు తగాదాలు రాబోతున్నా యనో లేకపోతే పెట్టుబడిదార్లకు, కార్మికులకు మధ్య feelings రెచ్చగొట్టుతున్న నోచెప్పి, దాన్ని నిషేధించటానికి యీ బిల్లులో అవకాశము కలిగింది. అందువ

వల్ల నేను యీరోజున ప్రభుత్వాన్ని యీ విషయము పునరాలోచించమని కోరుతున్నాను. ప్రభుత్వము అనేక చట్టములు తీసుకొనివస్తున్నారు. వాళ్లు సమ్మెలు చేసుకోటానికిగూడ అవకాశము ఉందని మనము ఒకప్రక్కన వాళ్లకు చెబుతున్నాము. అటువంటప్పుడు వాళ్లయొక్క ఆర్థిక సమస్యలను గురించి ప్రచారము చేసుకోకుండా నిషేధించటానికి మనమే యిటువంటి బిల్లులను తీసుకొనివచ్చి పెట్టుతున్నామని ప్రభుత్వమును గుర్తించాలి. కాబట్టి యిటువంటి చట్టమును తీసుకొనిరావడము సరికాదని అంటున్నాను. కాబట్టి మిగిలిన సవరణలు అన్నీ ఒకఎత్తుగాను, యీసవరణ ఒక ఎత్తుగాను చూడవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈరోజున రైతులు, కూలీలు వారియొక్క కోర్కెలను నెరవేర్చుకోటానికి వేరేపద్ధతులు ఏవీగూడ కనబడడములేదు. వాళ్లు యింకొకవిధముగా ప్రచారము చేసుకోటానికి వీలులేకుండా పోతున్నది. వారు చేసేటట్లైతే సూటిగా సమ్మెచేయాలి. లేకపోతే ప్రజలలో చెప్పుకునన్నా చెప్పుకోవాలి. అదీకూడ కాకపోతే వారు యీ బుర్రకథలద్వారానైనా వారియొక్క ఘోషను తెలియపరుచుకోవాలి. ఇంకను ఏమైన నాటకాల ద్వారానైనా అనేక రూపాలలో వారి సంగతి తెలియపరచుకోవాలి. ఈవిధములలోతప్ప వారికి వేరు మార్గములేదు. జమీందార్లకు రైతులకు మధ్య, పెట్టుబడిదార్లకు కార్మికులకు మధ్య తగాదాలు వచ్చినప్పుడు, ఆజమీందారుగాని, పెట్టుబడిదారుగాని ఏ Head Constable వద్దకో వెళ్ళి ఒక చిన్న పిటీషను పెట్టినట్లయితే అంతటితో, వారి performances ఆగిపోతవి. అలాంటి పరిస్థితులు యీబిల్లు ద్వారా ప్రభుత్వము తీసుకొనివచ్చి కల్పిస్తున్నది. అందువల్ల ఈసవరణ తప్పకుండా accept చేయమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఇది accept చేయకపోతే, యిందులో చాలాప్రమాదము వుంటుంది కాబట్టి దీన్ని ఏదో విధముగా బిల్లులో incorporate చేయాలని కోరుతున్నాను. ఎందుకంటే! ఈబిల్లు ద్వారా వారు ప్రచారము చేసుకునే సదుపాయాలు అన్నీగూడ ప్రభుత్వము తీసివేస్తున్నది. పెట్టుబడిదార్లకు, జమీందార్లకు పత్రికలు ఉన్నవి. వారు ఎంతడబ్బులయినా ఖర్చుచేసి పత్రికలలో వేయించుకుంటారు. ఇక పాపము! ఈకార్మికులకు, రైతులకు అటువంటి సదుపాయాలు లేవు. వాళ్ళకు నోరు ఉన్నది. జనము ఉన్నారు. వాళ్ల గోడు ఏవిధముగా తెలియపరుచుకోగలరు? (Interruption) నీవు ఉన్నావుగదా వారి తరఫున. (laughter). అలాంటప్పుడు కార్మికులకు, రైతులకు, జమీందార్లకు, పెట్టుబడిదార్లకు ఉన్న సాధనములు లేనేలేవు. ఆసంగతి మనముగూడ చూస్తూనేఉన్నాము. కాబట్టి యీరైతులకు కార్మికులకు ఏవిధమైన అవకాశాలు లేకుండా చేయడము సంజీవరెడ్డిగారికి తగదని వారికి విజ్ఞప్తిచేస్తున్నాను. నేనుగూడ యీసవరణను ప్లీడరును విచారించే వ్రాయించి తెచ్చాను. ఇందులో legal implications ఏవీలేవు. పోనీ యీ రూపములో యీసవరణ accept చేయకపోయినా, మరొక రూపములోనైనా రైతులకు కార్మికులకు అవకాశము ఉండేటట్లుగా బిల్లును సవరించటానికి యీసవరణను accept చేయమని కోరుతున్నాను. ఈసవరణను accept చేస్తే, వాళ్లయొక్క ఆర్థిక సమస్యలకు, ఆర్థిక హక్కులకు సంబంధించినంతవరకు యీ సెక్షను వర్తించదు అనియైనా categorical గా బిల్లులో వివరించవలసిన అవస

రము ఉన్నది. ఈ విషయాన్ని మంత్రిగారి దృష్టికితెస్తూ, బిల్లును ఆవిధంగా సవరించమని కోరుతున్నాను.

The amendment was duly seconded.

Mr. SPEAKER :- Amendment moved.

Add the following as Explanation V to sub-clause (vi) of clause 2 (2).

"Explanation V:- A performance shall not be deemed to be objectionable on the ground of promoting feelings of enmity or hatred between different sections of the people of India if it is intended mainly to better the economic status of any section or promoting unity of any section of the people."

The Hon. Sri N. SANJEEVA REDDI :—అధ్యక్షా, ప్రతిపక్షము వారు యిందులో ఏమోఉందని ఊరకనే భయపడుతున్నట్లు ఉన్నది. ఇప్పుడు జమీందార్లు, యింకా ఎవరెవరోవచ్చి పొడుస్తారని భయపడుతున్నారు. కాని ప్రభుత్వము దృష్టిలో అటువంటిది యేదీలేదు. ఈ బిల్లు ఏ జమీందార్లనో రక్షించటానికికాదు. పెట్టుబడిదార్లకు, కూలీలకు భూస్వాములకు రైతులకు మధ్య ఘర్షణలు జరిగితే, వారిమీదవీరు, వీరిమీదవారు అపహాస్యంగా వ్రాసుకోవడము అనే దానికి చోటు యివ్వకుండా చేస్తున్నాము. ప్రతిపక్షము దృష్టిలో అప్పారావు గారిలాంటివారిని కూడ జమీందారుగా చూస్తూ, యిక కనబడిన వారందరూ కూడ జమీందార్లని భయపడుతూ, యిక వారికి వ్యతిరేకంగా వచ్చినవారందరు గూడ జమీందార్ల క్రింద లెక్కకట్టినట్లుగా కనబడుతున్నది. అటువంటి యిబ్బంది కలుగుతుందేమోననే, యీ బిల్లుయొక్క అవసరమని అంటున్నాను. కూలీకి పోవద్దు, రైతులు ఎవరూ పోవద్దు అని చెప్పడమువల్ల, కూలీలు, రైతులు అందరు కట్టుకట్టి, వారు, వీరు అందరూ చేరి తగాదాలు పెట్టుకొని, పెద్దరభస చేసుకున్నవి ఎన్నో చూచాము. గుడివాడదగ్గర గ్రామములో గూడ ఒకటి చూచాము. ఇక్కడ మనము ఏదోఒక రోజున ఒక ఉపన్యాసము చేసి వెళ్లుతాము. ఇక అక్కడ గ్రామాలలోచూస్తే, ప్రతిరోజు తగాదాలే. ఆరకమైన బాధలు ఎన్నోవుంటాయి. అవికూడ మనకందరికినీ తెలుసు. కాబట్టి యీ బిల్లు జమీందార్లను రక్షించాలనే దృష్టితో తీసుకొని రాలేదు. ఇప్పుడు జమీందార్లు ఎవరూ లేరే. అందరూ పోయారుగదా. ఇంకను పెద్దపెద్ద భూస్వాములు కూడ ఎక్కడైనా ఉంటే వారినికూడ పంపించటానికి మనం కృషిచేస్తూనే వున్నాముగదా. కాబట్టి అటువంటి దృష్టియేమీలేదు, ఇందులో. ఒక section of the people, అంటే labourer అని. ఇంకా యిటువంటివారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—మంత్రిగారి దృష్టిలోనికి నేను పోలేదు కాని దానియొక్క effect యేమికాబోతున్నదో నేను చెప్పాను. ఎవరైన పోలీసువారి దగ్గరకుపోయి వాళ్ల ఆర్థిక సమస్యలను గురించి తగాదాలను రెచ్చగొట్టుతున్నావని పిటిషను పెట్టినట్లైతే, యీ బిల్లు ద్వారా సంజీవరెడ్డిగారిని అడగకుండానే, అవి నిషేధించటానికి వీలు అవుతుందా? లేదా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఎట్లా పీలు ఉన్నదని అంటాను? జమీందార్లు లేకుండా చేశాము కదా. పెద్దపెద్ద భూస్వాములను కూడ చేయబోతున్నాము. ఇకమిగిలినవారు ఎవరైనా అక్కడక్కడ వుంటే, వారిమధ్య తగాదాలు రాకుండా చేయటానికే యీ బిల్లు,

Sri PILLALAMARRI VENKATESWARLU :—అట్లా అయితే, యీ బిల్లు అవసరమేలేదు గదా !

The Hon. Sri N. SANJEEVA REDDI :—కాదు. దీని అవసరము ఉంది. దీనియొక్క అవసరము మనముచూచాము. By practical experience వల్ల తెలుసుకోగలిగాము. రైతులు, కూలీలు విషయములో వచ్చినతగాదాలు, ఘర్షణలు ప్రతి గ్రామములోను ఎన్నో జరుగుతున్నవి. కూలికి మేము రాము అని అన్నారు. ప్రక్కన ఉన్న గ్రామమునుంచి కూలీలను రానీయకుండా చేశారు. భూస్వాములు గాని, పెట్టుబడిదార్లుగాని, మిమ్ములను కూలికి పిలువము అని చెప్పిన కేసులుగూడ ఉన్నవి. కాని యిది ఆరకమైన దానికి సంబంధించినదికాదు. అంతేకాని జమీందార్లను, భూస్వాములను దృష్టిలోపెట్టుకుని చేసినదికాదు యిది. అందువల్ల ప్రతిపక్షమువారు యీ బిల్లునుగురించి భయపడవలసిన అవసరము లేనేలేదు.

Mr. SPEAKER :—The question is :—

To add the following as Explanation V to sub-clause (vi) of Clause 2 (2).

"Explanation V :— A performance shall not be deemed to be objectionable on the ground of promoting feelings of enmity or hatred between different sections of the people of India if it is intended mainly to better the economic status of any section or promoting unity of any section of the people."

The motion was lost.

SUB-CLAUSE (3).

Sri S. VEMAYYA :—Sir, I move the following :

"Delete the word 'pantomime' in line 1 of sub-clause (3) of Clause 2.".

ఈ Pantomime అనేమాట వాడవలసిన సందర్భము యేమిటో నాకు తెలియడములేదు. కాని నేను దాన్ని అర్థముచేసుకో గలిగినంతవరకు చూస్తే దీనికి అర్థము "Fairplay-action at X-mas" అని ఉన్నది. This is what I learn when I referred to the Dictionary. అంటే X-mas time లో అన్నిచోట్లలోకూడ యిది వాడేమాట. ఇక్కడదీన్ని ఉపయోగించి, దానిని అర్థము కాకుండా తప్పుకునేదానికంటే, అసలు దానియొక్క అర్థముయేమిటో తెలుసుకోవాలని నేను dictionary చూచాను. దానికి అర్థము X-mas time లో మామూలుగా పిల్లలు వేసుకునే డ్రామాలకు సంబంధించినదిగా ఉన్నది. అందుచేత

యీబిల్లులోనుంచి యీ "Pantomime" అనేమాటను తొలగించాలని నేను సవరణను ప్రతిపాదిస్తున్నాను. సాధారణముగా పిల్లలువగైరాలు వేసే డ్రామాలకు గూడ యిదివర్తిస్తుంది. Dictionary చూడడము వల్లనే దీనికి అర్థము నేను తెలుసుకోగలిగాను. ఇది మతమునకు సంబంధించినది. కాబట్టి యీమాటను తొలగించాలని అంటున్నాను.

The amendment was duly seconded.

Mr. SPEAKER :—The motion before the House is :—

"Delete the word 'pantomime' in line 1 of sub-clause (3) of clause 2.".

The Hon. Sri N. SANJEEVA REDDI :— "Pantomime" అంటే అదిగూడ ఒక పిల్లలనాటకమని అన్నారు. అది correct అయితే కావచ్చు. కాని యిది యీరకముగా వాడినందువల్ల, యిందులోవచ్చేయిబ్బంది యేమీలేదు. Play అన్నాము. Drama అన్నాము. దానిక్రింద cloak గా తీసుకొని రక్షించబడకుండా ఈ మాట పెట్టాము. కాని దీనివల్ల వచ్చేబాధ యేమిలేదు. కాబట్టి దీన్ని యిదేవిధముగా ఉండనివ్వండి. మార్చుకోనవసరము లేదని అంటున్నాను.

Sri S. VEMAYYA :— ఇక్కడ యిది నాకు అర్థముకాలేదు. తరువాత Dictionaries వగైరాలు చూస్తే, యిది మతసంబంధమైనదని తెలుతున్నది. X-mas timeలో వేసుకునే dramas కు pantomime అని అర్థము చెబుతున్నది. కాబట్టి మతసంబంధమైన యీ మాటను తొలిగించాలని అంటున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :— అందులో యేమి యిబ్బందిలేదు. కాబట్టి ప్రస్తుతము దానిని మార్చవలసినంత అవసరము నాకు కనబడలేదు.

Mr. SPEAKER :— The question is :—

"Delete the word "pantomime" in line 1 of subclause (3) of Clause 2."

The amendment was lost.

Sri S. VEMAYYA:- Sir, I move the following amendment:-

"Delete the words "or any burrakatha, and includes the singing of any ballad" in sub-clause 3 of clause 2.

దీనిని గురించి general discssuion లో కొంతమంది సభ్యులుగూడ మాట్లాడారు. అందువల్ల యిప్పుడు దీన్నిగురించి నేను ప్రత్యేకముగా చెప్పవలసిన పని లేదు. ఈ బుర్రకథలు వగైరాలు, అన్నికూడ కనీసము ప్రతి గ్రామములో మనకు కనబడుతూనే ఉన్నవి. చూస్తూనేవున్నాము. వింటున్నాముకూడ. బుర్రకథలు రావడమువల్ల ఉద్రేకాలు కలుగుతాయని అనుకోనక్కరలేదు. ఏ కొద్ది విషయములోనైనా వీరికి వారికి ఉద్రేకాలు కలుగవచ్చు. బుర్రకథ చెప్పినంత మాత్రాన ఉద్రేకాలు పెరుగుతాయని ప్రభుత్వము ఈ బిల్లుద్వారా వాటిని నిషేధించడము కనబడుతున్నది. కాని దీనివల్ల ప్రజలలో కలిగే ఉత్సాహము, ఉల్లాస

ముగు ప్రభుత్వము తగ్గించివేస్తున్నది. ప్రజల సహకారము కావాలన్నప్పుడు బుర్రకథలే ఎక్కువగా ఉపయోగపడుతాయని గూడ మంత్రిగారు గుర్తించాలి. కాని ఏది ఎట్లున్నను ఈ బిల్లులోనుండి కనీసము "బుర్రకథలు" అనే మాటనైనా తొలగించాలని నేను సవరణ ప్రతిపాదించాను. దానిని ఖచితముగా తొలగించాలని, దీనికి మేము యిచ్చిన సవరణను ఆమోదించవలసిందని కోరుతున్నాను.

The amendment was duly seconded.

Mr. SPEAKER :— Amendment moved —

"Delete the words 'or any burrakatha, and includes the singing of any ballad' in sub-clause 3 of clause 2.

Sri A. KALESWARA RAO :— అధ్యక్షా మహాశయా, ఇప్పుడు ఒక క్రొత్తవ్యవహారము ముఖ్యంగా ఆంధ్రదేశములో వచ్చిపడ్డది. కర్ణాటక దేశములోకూడ యిటువంటివి కొన్ని popular ballads యిదివరకు విన్నాము. ప్రజలను బాగా ఉద్రేకపరచే కీర్తనలు, కథలు ఉన్నవి. ముఖ్యంగా మనదేశములో అందులో ఎక్కువ ప్రజారంజకముగా వ్రాసిఉన్నది, బొబ్బిలికథ ఉన్నది. ఈ బుర్రకథకు అదేమూలము అని చెప్పవచ్చు. ఇప్పుడు యీ బుర్రకథలు దేశము అంతటాగూడ వ్యాపించాయి. నాటక యుగముపోయి, సినిమాయుగము వచ్చింది. ఈ సినిమాయుగముకంటేకూడ బజారు బజారునగూడ ఉంటున్నది యీ బుర్రకథ యుగము. మొదట్లో యీ బుర్రకథలు ఆంధ్రదేశములో రాజకీయముగా ప్రారంభించినవారు మన కమ్యూనిస్టు సోదరులు. వారు చెప్పడము ప్రజలకు జరుగుతున్న అన్యాయాలు యింత-అని కాదు, కార్మికులకు, పేదరైతులకు సంరక్షణలేదు. ప్రభుత్వము ఉన్నదే భాగ్యవంతులకోసము, భూస్వాములకోసము, యిది ప్రభువుల తొత్తు ప్రభుత్వము, అంతా యీ విధంగా అన్యాయాలు చేస్తున్నది అని, అంతా అతిశయోక్తులతోను, ద్వేషాలను, ఉద్రేకాలను, ప్రజలమధ్య రెచ్చగొట్టే విధముగా బుర్రకథలద్వారా వారికి యిష్టము వచ్చినట్లుగా చెప్పడం, తరువాత ఎలెక్షన్సులోగూడ వాటిని విరివిగా వుపయోగించడము సాగించారు. దీన్ని అంతా మన కాంగ్రెసువారు తట్టుకోవలసి వచ్చింది. నాటకముకంటే, సినిమాకంటేగూడ, బుర్రకథ చెబుతున్నారంటే, ప్రజలలో ఎక్కువగా ఉత్సాహముపుట్టి, భోజనముచేయగానే ముందుగా వెళ్ళిచూడటానికి ఎక్కడెక్కడి జనము మూగేవారు. ప్రజలలో నిజంగా ఉద్రేకాలు రెచ్చగొట్టేవి యీ బుర్రకథలు తప్ప యింకొకటిలేదు. సినిమాచూచిన, నాటకాలుచూచినా, ఆమాదిరిగా ఉద్రేకము కలిగించేది యీ బుర్రకథతప్ప, యింకొకటి ఎందుకూ పనికిరాదు. సినీమాకు అంటే, నాటకమునకు అంటే, రూపాయో, అర్ధరూపాయో, చివరకు పావలా అయినా యిచ్చుకోవలసి వుంటుంది. అంతకంటె బాగా వినటానికి సొంపుగా వుండేది, యేఒక్క కానీఖర్చుకూడ లేకుండ చూడగలిగింది, యీబుర్రకథ. ఎక్కడైనా బుర్రకథ చెప్పబోతారంటే చాలు. ఇక భోజనము చేయడమే ఆలస్యము. ఎటువంటివాడైనాసరే, ఆఖరుకు కుంటివాడైనా, గుడ్డివాడైనా, ఎంతదూరము అయినాసరే వచ్చి వినటానికి తయారు అవుతారు. వరలక్ష్మి వచ్చింది, ఉపన్యాసము చేస్తుంది అంటే వచ్చేది నిజమేకాని, అంతకుమించింది యీ బుర్రకథ. వరలక్ష్మి, బుర్రకథ యీరెండూవస్తే, యిక వేలకువేలువచ్చికురిసి పోతారు, జనమును ఆపటానికి వీలేఉండదు, కాబట్టి ప్రజలు బుర్రకథ చెబు

తున్నారంటే, ఆపరిస్థితిలో ఉంటున్నప్పుడు, యీ "బుర్రకథ" అనేదాన్ని బిల్లులో చేర్చకపోతే యీ బిల్లుయొక్క ఉద్దేశ్యమే కనబడదు. ఏదో స్థానం నరశింహా రావుగారి నాటకము నిషేధించమని అంటే, అందులో పెద్ద విశేషము యేమీ ఉండదు. ఏదో కన్నాంబ సినిమా ఉన్నదనా ? కాబట్టి దానివల్లకాదు యిప్పుడిగి, ప్రతి ఊరులోనూ, ప్రతి పల్లెలోనూ, మీటింగు అంటే రానేరారు. అటువంటిది బుర్రకథ చెబుతున్నారంటే, లెక్కలేకుండా వస్తారు. అసలు బుర్రకథ మధ్య ఎవ రైనా మాట్లాడితే అప్పుడు మరీమీలుగా ఉంటుంది. అంటే నా అనుభవముమీద నేను చెబుతున్నాను. అసలు బుర్రకథ అనేది యిందులో చేర్చకపోతే, యీ బిల్లు యొక్క అవసరము యేమిటి ? బుర్రకథలద్వారా ప్రజలలో ద్వేషాలు కలుగ జేస్తున్నారు, రెచ్చగొట్టుతున్నారనే, అవి ఆపటానికి యీ బిల్లుతీసుకొని రావ డమునకు అవసరము వచ్చింది. లేకపోతే యేమీలేదు. మనము అందరము peaceful co-existence కావాలని అంటున్నాము. మహాత్మాగాంధీ మనకు ఆదర్శకుడు అంటున్నాము. మనము అందరము శాంతి కావాలని అంటున్నాము. మనకు శాంతిదూత జవహర్లాలు నెహ్రూ అని అంటున్నాము. రష్యావారు కూడా **Stalin** విధానాన్ని త్రోసివేశారు. ఇదివరకు ఉన్న పుర్రెలు అన్నీగూడ మెడలో వేసుకునే విధానాన్ని అంతా మార్చుకున్నారు. వారుగూడ ఏడుగురుతో ఒక కమిటీని ఏర్పాటు చేసుకున్నారు. ఇదివరకు మాదిరి కాకుండా, యిప్పుడు రష్యాగూడ బాగుపడుతున్నది. రష్యా ఆ విధంగా చేయడము మనకెంతో సంతోషముగా ఉన్నది. రష్యా బాగుపడడము, **peaceful co-existence** ఏర్పడడము, గాంధీగారి తత్వము రావడము, అందరికి సంతో షముగా ఉన్నది. నిజంగా బుర్రకథలు చెప్పడం సాగకుండా చేయాలని నా ఉద్దే శ్యము కాదు. నిజంగా యీ బుర్రకథలకు ప్రభుత్వము ప్రోత్సహాము యివ్వవల సిందే. అందువల్ల యిందులో కమ్యూనిస్టులు ప్రభుత్వముతో **co-operate** చేయాలి. ఇది యేదో పిల్లవాళ్లు తెలివితక్కువవారు కాబట్టి, వారుయేమైనా చేస్తారేమోనని ప్రభుత్వము యీ బిల్లు తెచ్చారు. అంతేకాని వేరుకాదు. అందు వల్ల మన భారతదేశాన్ని మనయొక్క విశాలాంధ్రను ఉత్తేజముగా చేసుకోటానికి ప్రజలలో మనయొక్క పాతచరిత్ర ఎట్లాఉన్నదో, భావికళ్యాణము ఎట్లాఉన్నదో, మనమందరము కలిసి చూచుకోవాలి. కాబట్టి యిప్పుడు ప్రభుత్వము యీ బుర్ర కథలను చెప్పడము అనేది నిషేధించాలని అంటే, యిది అంతా ఎందుకు కాబట్టి, ప్రతిపక్షము తెచ్చిన సవరణ చాలాతప్పు గనుక దాన్ని ఉపసంహరించు కోవాలని కోరుతున్నాను.

* **Sri M. NAGIREDDI** :— అధ్యక్షా ! ఈ **Performances Bill** మీద, బుర్రకథలు మొదలయినవాటి విషయంలో ఇదివరకు చాలా చర్చ జరిగింది. కాళేశ్వరరావుగారు ఏమిచెప్పారంటే, కమ్యూనిస్టు సోదరులు మొట్ట మొదట ఈ బుర్రకథలను తీసుకువచ్చి పెట్టారని. అసలు పురాతనంనుంచీకూడా గ్రామాలలో ఈ వైజ్ఞానిక ప్రదర్శనాలనేటటువంటివి, అనేక కళారూపాలలో, ప్రజలకు సులువుగా అందుబాటులో ఉండడానికి ఏర్పాటుచేయబడ్డవి. ఈ బుర్ర కథలూ, చెంచునాటకాలు, బొమ్మలాటలూ, వీధిభాగవతాలు ఇల్లాంటివన్నీ పురాతనంనుంచీకూడా మన ఆంధ్ర సంస్కృతిలో ఉన్న కళారూపాలు. ఐతే వీటిని ఆనాడు ఉన్న పరిస్థితులకు అనుగుణంగా రూపొందించడం జరిగింది. దేశం

పురోగమిస్తున్న కొద్దీ ఈ కళారూపాలలో కూడా అనేక మార్పులు వచ్చాయి, వస్తున్నాయి అనేదానితో కాశీశ్వరరావుగారే కాక అందరూ అంగీకరిస్తారనుకుంటాను. కవిత్వంలో మార్పు వచ్చింది. రాజకీయాలలో మార్పు వచ్చింది, వస్తోంది. ఈనాడు కళారూపాలలో కూడా దేశం పురోగమిస్తున్నకొలదీ మార్పు వస్తోంది. ఈ మార్పులతోపాటు చదువులో మార్పు వస్తోంది. విద్య, వైద్య సౌకర్యాలలో మార్పు వస్తూన్న విషయాన్ని కాదనలేం. మార్పు రావాలి, అభివృద్ధి రావాలని మనం కోరుతూయున్నాం. ఈ మార్పులు జరుగుతూయున్నా కవిత్వం, కళలూ ఏమారవనిన్నీ, దీనివల్ల ఏదో వస్తుందని మనం అభిప్రాయపడడం సరియైనటువంటిదికాదని మనవిచేస్తున్నాను. ప్రజల నిత్య జీవితానుభవంలో ప్రజల యొక్క కూడు, గుడ్డ సమస్యలకు సంబంధించిన రాజకీయ చైతన్యం పెంపొందించుటకు కళారూపాలుకూడా దోహదం ఇస్తాయి. ఈ కళారూపాలలో వీధి భాగవతాలదగ్గరనుంచి, బొమ్మలాటలదగ్గరనుంచి, బుఱ్ఱకథలదగ్గరనుంచి అన్నిటిలో మార్పురావలసిన అవసరం ఉన్నది. అలాంటి మార్పు వచ్చిందన్న విషయం గ్రహించాలి. నంబూరి శ్రీనివాసరావుగారు ఎన్నికల ప్రచారాన్ని గురించి మాట్లాడుతూ, ఎన్నికలలో అల్లాంటివి వ్రాశారు, ఇల్లాంటివి వ్రాశారని విమర్శించారు. ఎన్నికలలో అడపా తడపా అల్లాంటివి అసలు ఏమీ జరగలేదనికాదు. జరిగి ఉండవచ్చు. అవి కమ్యూనిస్టులే చెయ్యలేదు. రెండోవైపునుంచికూడా జరిగాయి. 'దిగు దిగు నాగిరెడ్డీ, దిగరా నాగిరెడ్డీ" అని పాడిన కాంగ్రెస్ సోదరులూ ఉన్నారు. నంబూరి శ్రీనివాసరావుగారే చెప్పారు. వెంగమ్మ నాటకం సుందరయ్యగారి పేరుమీద వేశారని. అది Election tempo లో ఒకరు ఒకటిచేస్తే ఇంకొకరు ఇంకొకటి చెయ్యాలన్న ఉద్రేకంలో జరుగుతాయి. అవి ఎక్కడనో అడపా తడపా జరిగిన విషయాలుకాని, దాన్ని అవకాశంగా తీసుకుని ఈవేళ ఈబిల్లు తీసుకుని రావడం అనేది సమంజసంకాదు.

**The Hon. Sri N. SANJEEVA REDDI:-** నాగిరెడ్డిగారు ఒక పొరపాటు చేస్తున్నారు. అడపా తడపా జరిగేదానికే ఈచట్టం చేసేది. ఇది ప్రతిరోజూ చెప్పుకునే బుఱ్ఱకథలకు కాదు.

**Sri M. NAGI REDDI :—**కాశీశ్వరరావుగారు బుఱ్ఱకథలు రాజకీయాలలో ముందు కమ్యూనిస్టు సోదరులు ప్రవేశపెట్టి ప్రజలను రెచ్చగొట్టి, రౌద్రపూరితంగా చేశారని అన్నారు. అది సరియైనది కాదన్నప్పుడు, దాన్ని కాంగ్రెసువారు ఎందుకు అనుసరించవలసి వచ్చిందని నేనడుగుతున్నాను. కమ్యూనిస్టులు తప్పుచేస్తున్నారు, అది మంచిదికాదన్నప్పుడు, ఆతప్పు సవరించుకోడానికి బదులు దాన్ని అనుకరించవలసిన అవసరం కాంగ్రెసు సోదరులకు ఎందుకు వచ్చింది? రైతులకు, కూలీలకు వచ్చే తగాదాలలో మేము వీటిని ఉపయోగిస్తున్నామని అన్నారు. ఈవిషయం నిన్న చర్చలో కూడా వచ్చింది. 'మాభూమి" నాటకం ఏకూలీలకూ రైతులకూ సంబంధించినదని దాన్ని నిషేధించ వలసి వచ్చింది. అది జమీందార్లకు వ్యతిరేకంగా రజాకర్ ఉద్యమసమయంలో హైదరాబాదు State లో జరిగిన కాంగ్రెస్ పోరాటానికి అనుకూలంగా వ్రాయబడిందే. కాంగ్రెస్ పోరాటంలో ఆనాడు పల్నాడు తాలూకాలో కూడా మేము "మాభూమి" నాటకంవేసిన రోజులలో కాంగ్రెస్ నాయకులైన కావూరి వెంకయ్యగారే తన హరిజన hostel కు funds నిమిత్తమై వేయించిన drama

అది. ఆనాడు కాంగ్రెస్ వారు అంగీకరించేసటువంటిది. అది జమీందార్లకూ నిరంకుశ ప్రభుత్వోద్యోగులకూ వ్యతిరేకంగా ప్రజలను ప్రేరేపించుటకు కమ్యూనిస్టులేకాదు, కాంగ్రెసుకూడా వినియోగించిందని అంగీకరిస్తారనుకుంటాను. అదేవిధంగా అల్లూరి సీతారామరాజుగారి బుఱ్ఱకథ అదికూడా నిషేధించింది ప్రభుత్వం. ఐతే ఈమధ్య ఆనిషేధం తీసేశారనుకోండి. ఇదేమీలేకుండా ఏరామాయణమో, ఏబొబ్బిలికథో చెప్పుకుంటూ ప్రజలను ఏరాజకీయ చైతన్యం లేకుండా చెయ్యాలని ప్రభుత్వోద్దేశ్యమా ? ప్రజలను రాజకీయంగా ముందుకు తీసుకువెళ్ళడానికి, వాళ్ల ఆర్థిక సమస్యలపై పోరాడేందుకు, వాళ్లకు ఐక్యత కల్గించేందుకు కాకుండా, ఊరికే పురాణాలు చెప్పుకుంటూ ఉండడం కాంగ్రెస్ నాయకులు కూడా బలపరుస్తారని అనుకోను. దేశం పురోగమిస్తోంది. ఇప్పుడు పంచవర్ష ప్రణాళిక విషయమై దాని మంచి ఏమిటో, చెడు ఏమిటో బుఱ్ఱకథలద్వారా నాటకాలద్వారా ప్రచారం చెయ్యడానికి ప్రభుత్వం తయారుకావడంలేదా ? అందులో ఉన్న లోపాలను చెబితే అది తప్పు ఎల్లాఔతుంది. అందులో మంచిని చెప్పవలసిన అవసరం ఉంది. ప్రజలను చైతన్యవంతులను చెయ్యడానికి ఈ బుఱ్ఱకథలు ఉపయోగపడుతున్నాయనే విషయం ప్రభుత్వం గుర్తించాలి. బుఱ్ఱకథలద్వారా ఎన్నికలలో గెలవాలనిచెప్పి, బుఱ్ఱకథలద్వారా జనాన్ని ఆకర్షించడానికి కమ్యూనిస్టులు చేశారని కాశేశ్వరరావుగారన్నారు. కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా ఉన్న 1952 సం॥ రోజులలో బుఱ్ఱకథలు చెప్పారు. అప్పుడు ఎక్కువ seat లు వచ్చాయి. ఈ elections లో అంతకంటె ఎక్కువగానూ చెప్పారు. అంతకంటె తక్కువ seat లు వచ్చాయి. అందువల్ల ఎన్నికలలో గెలవడానికి బుఱ్ఱకథలు ప్రధాన medium అని గాని, దానివల్ల ప్రజలను రౌద్రపరుస్తారు, ఉత్తేజపరుస్తారు, అని అనుకోవడం సరియైనదికాదు.

**Sri T. V. RAGHAVULU** :— On a point of information Sir, బుఱ్ఱకథలను నిషేధించలేదు. కేవలం అశాంతిని కలిగించేది సంఘానికి ఉపద్రవం తెచ్చేది, వర్గద్వేషం రెచ్చగొట్టేటటువంటి బుఱ్ఱకథ నిషేధించడమే, ఈబిల్లు ఉద్దేశ్యము. అందుచేత ఏ బుఱ్ఱకథ అయినా నిషేధింపబడిందని అనుకోవడం పొరపాటని మనవిచేస్తున్నాను.

**Sri M. NAGI REDDI** :— అశాంతి అనే అప్పుడు బుర్రకథలను నిషేధించడం జరిగింది. మంచి చెడ్డ దగ్గరనే తేడావచ్చింది. మీరు characterisation చెయ్యడములోనే అమలుపరచడములోనే తేడా వస్తుంది. నిన్ననేవచ్చింది. బండ్లమీద Tax వసూలు చెయ్యకూడదనే బ్రహ్మాండమైన సవరణ తీసుకువచ్చారు. Half an Hour Debate కూడా వచ్చింది. ఈనాడు rules, rules గానే ఉండవచ్చును. ఈనాడు సంజీవరెడ్డిగారిబిల్లు ఆక్షేపణకరమైనట్లు, ప్రజలు వినతగనట్టు బ్రహ్మాండంగా విప్లవము ప్రజలను రెకెత్తించేటటువంటివి వేయవద్దని బిల్లులో ఉండవచ్చును. గాని ఈనాడు ఆచరణలో జరుగబోయేది ఏమిటి ? ఇదిసరైన పద్ధతికాదు. ఈనాడు, కాశేశ్వరరావుగారు చెప్పారు. బుర్రకథకు రు 0-8-0, 1-0-0 కూడా అవసరములేదు అన్నారు. కాంగ్రెసుపార్టీవారు పెట్టేదానికి టిక్కట్లు 2/-, 4/- పెట్టవచ్చును. అందుబాటులో ఉండాలి. గ్రామాలలో కాలక్షేపం కావడం వారు చైతన్యవంతులు కావడము, సమస్యలను తెలుసుకొనడానికి ఏవిధమైన ఖర్చు లేకుండా ప్రజలకు వినిపించే అవకాశం కలుగచెయ్యకూడదంటారా ?

మీరు వినిపించే నాటకాలకు 4 రూ. లు ఇవ్వాలంటారు నిజముగా ప్రజలను చైతన్యవంతులు చెయ్యడానికి, విజ్ఞానవంతులను చెయ్యడానికి 8/– ఇచ్చిపోనివ్వండి. ఈ విధముగా వినిపించడము ప్రజలను దగ్గరకు తీసుకొనడము కాదు. ఆ దృష్టితో కాశేశ్వరరావుగారు తీసుకువచ్చినందుకు చాలా విచారించవలసిఉంది. అందుకనే ఈ బుర్రకథలను ఏ విధముగా బిల్లులో చేర్చడము అనేది సరియైనది కాదు. ప్రభుత్వము ఏ అభిప్రాయముతో ఉన్నప్పటికికూడా అమలు జరిగిపోయేటప్పటికి రేపు పోలీసు అధికారులు వీటిని ప్రతిదానికి ఏదో ఒక రకమైన కారణంచేత చర్చ తీసుకోవడమునకు తయారవుతారనే విషయము ఉన్నది. అందుకనే ప్రభుత్వం దీనిని తొలగించవలెననికోరుతూ, ఈ సవరణను బలపరస్తూ నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

* Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, శ్రీ కాశేశ్వరరావుగారు మాట్లాడుతూ బుర్రకథలు ఎన్నికలలో కమ్యూనిస్టులు తీసుకువచ్చారు అన్నారు. వారు మాతో 'c' class jail లో ఉండలేదు. వారికి జ్ఞాపకం లేదు. పెద్దాపురంలో లాఠీదెబ్బలు తినినప్పుడు చెయ్యివిరిగిపోయింది. ఆకోడేటి రంగాచార్యులుగారు 'కాంగ్రెసు ఉద్యమము' అనే బుర్రకథను తీసుకొని వచ్చి తూర్పుగోదావరి, గుంటూరు జిల్లాలలో తీవ్రమైన ప్రచారముచేసి జాతీయ ఉద్యమ ప్రచారంలో నూతనఘట్టాన్ని తీసుకువచ్చారు. అది శ్రీ కాశేశ్వరరావు గారికి జ్ఞాపకము చేస్తున్నాను. "దండాలు, దండాలు భరతమాత" అనేది ప్రజలను ఉత్సాహపరచింది. ఉద్రేకపరచలేదు. ఉత్సాహానికి ఉద్రేకానికి చాలా తేడా ఉంది. ఉద్రేకపరచడము దెబ్బలాట కోసము. గాని జాతీయ ఉద్యమములో నూతన కళాప్రజ్ఞ అనేక రూపములలో ఉత్సాహపరచింది. బౌద్ధమతములోగాని, హిందూ మతములోగాని, మరొక రూపములోగాని తన భావాన్ని అన్వయం చేసుకుంటూ ప్రజాసామాన్యంలోకి తీసుకువస్తుంది. ఈ నాడు బుర్రకథలను కొత్తగా ఆక్టులో చేర్చినారు. ఇది బుర్రకథకాదు. తందానతాన, బొబ్బిలికథ, కాటంరాజు కథలు ఉన్నవి. అవికూడా నిషేధించుతారా? రెండవది: ఒక అభిప్రాయము ప్రజలకు చెప్పడానికి ఏ రూపంలో తెచ్చినా నిషేధించడానికి అవకాశం తీసుకుంటారు అని అనిపిస్తుంది. శ్రీ సంజీవరెడ్డిగారు "ఇది అందుకు కాదు. ఏదైనా ప్రజలలో వివాదం తీసుకువచ్చి శాంతిని భంగపరచింది" అని చెప్పవచ్చును. ఉద్దేశము ఒకటి కావచ్చును. అమలుజరిగినపుడు స్థానిక అధికారులు బలంఉన్నవారు ఉపయోగించుకుంటారు. తరువాత ప్రభుత్వంవద్దకు రావచ్చును. పనిమాత్రము అయిపోతుంది. తరువాత పొరపాటు జరిగింది అనవచ్చును. Good intention ఉన్నది. చేశాడు కనుక అది పొరబాటు అని ఆక్టులో పెడుతున్నాం. నిజముగా పొరబాటుచేసినా అది అమలుపరచుకుంటున్నాము. దానికి immunity ఉన్నదని చెప్పడమువల్ల ఈ ప్రమాదాన్ని మరొకసారి చూడవలెనని కోరుచున్నాను. తగాదాలువస్తే ఆపవద్దని ఎవరూ చెప్పరు. మతవివాదాలు వచ్చి గ్రామాలలో హత్యలుజరిగితే, factions ఉన్నప్పుడు ఆపవద్దని ఎవరూ చెప్పరు. గాని కళారూపాలను రూపం లేకుండాచేసే ప్రమాదం దానిలో ఉన్నదేమో తీవ్రంగా ఆలోచించవలెనని ఉపముఖ్యమంత్రిగారిని ప్రార్థిస్తూ నేను విరమించుచున్నాను.

Sri P. SUNDARAYYA :— అధ్యక్షా, కాశేశ్వరరావుగారికి నా అభివందనములు తెలియచేస్తున్నాను ఎందుకంటే. ఈబిల్లుకు సంబంధించిన అసలు విష

యాలను సంజీవరెడ్డిగారు చాలా చాకచక్యముగా కప్పిపుచ్చినాకూడా కాంగ్రెసు లెజిస్లేచరుపార్టీ ఉపనాయకులు కుండబద్దలుకొట్టినట్లు బిల్లుయొక్క అసలుఉద్దేశము తెలియచేసినందులకు కాశేశ్వరరావుగారికి అభివందనములు తెలియచేస్తున్నాను.

బుర్రకథ తీసేస్తే ఈబిల్లు ఎందుకు, 1876 ఆక్టు చాలును. దానిలో కేవలం నాటకములని ఉన్నది. దానిలో బుర్రకథలు, pantomime అంటే విచిత్ర వేషాలనుకుంటాను, నాటకాలు, బుర్రకథ singing of any ballad అంటే వీదలగాథలు, పాటలు అయినాసరే, జానపదం అయినాసరే మేము నిషేధించవచ్చునని ఉన్నది. అదేవిధముగా holding of any dialogue సంభాషణలు అయినాసరే నిషేధించవచ్చును. ఇవన్నీ నాటకానికి అర్థము అని చెప్పారు. అందుచేతనే ఈ బుర్రకథను, ballad తొలగించవలెనని శ్రీ వేమయ్యగారి సవరణను బలపరుస్తున్నాను.

బుర్రకథ రాజకీయాలకు ఉపయోగిస్తున్నారని అన్నారు. జానపద గేయాలు ప్రజల కళారూపం అన్నారు. ఉపయోగించుకున్నాము ఇకమీదకూడ ఉపయోగించుతాము. దానిలో పోటీచేద్దాము రండి! ఎవరు చక్కగా చేస్తారో చూదాము. నిన్న సంజీవరెడ్డిగారు చెప్పారు. బూతులు తిట్టడముకూడ ఒక జానపద గేయమా అన్నారు. ప్రకాశంగారిని నాగిరెడ్డిగారిని తిట్టడము తప్పని చెప్పనుగాని ప్రజలే అవసరమైన మర్యాద ఇస్తారనుకుంటాను. ప్రజలు ఊరుకోరు. నిషేధించడం తప్పు అంటున్నాము. ఈ ప్రజలమీద అంత విశ్వాసము ఉన్నందుకు సంజీవరెడ్డిగారికి నా అభివందనములు. ఆ విశ్వాసం ఈ బిల్లు తీసుకొనివచ్చినప్పుడు ఎందుకు లేకపోయింది.

ఎన్నికలలో ఉద్రేకముతో మీరు తిట్టినా, మేము తిట్టినా ప్రజలు విని తగిన అభిప్రాయానికి వచ్చారు. వాటిని ప్రజలు వద్దని చెప్పలేదు. ఈ బిల్లు ఎందుకు పెట్టవలసివచ్చింది. దానికి అర్థము ఏమిటి ? మేము అధికారములో ఉన్నాము కాబట్టి ప్రతిపక్షపార్టీలు చేసినదిఅంతాకూడా ప్రభుత్వ విద్రోహకరమైనదని, అల్లర్లకు, తగాదాలకు దారితీస్తుందని ఈ పేరుపెట్టి అణచివేసేదానికి వారి ఇష్టమువచ్చేటట్లు పనికివచ్చే పనిముట్టుతప్ప ఏమీలేదని స్పష్టముగా తెలుస్తుంది. ఈరోజున మేము ఉపన్యాసాలు చెపితే వినేవారులేరని కాశేశ్వరరావుగారు చెప్పారు. బుర్రకథలుఉంటే ప్రజలుఎక్కువగావస్తారు అని ఆయనేఅన్నారు. మధ్యమధ్యన మాట్లాడితే ప్రజలు అవతల బుర్రకథ వస్తుందని వస్తారన్నారు. దీనికి మేము చెప్పేది ఏమిటంటే: ప్రజలలో రాజకీయాలకోసము, ప్రతిపక్షాన్ని విమర్శించేదానికి రాజకీయాలను కళారూపములోను ఉపయోగించుకోవడములో తప్పులేదు. మాకు అభ్యంతరంలేదు చెయ్యవచ్చును.

ఈ రోజున రాజ్యాధికారం చేతుల్లో ఉందని ప్రతిపక్షానికి ఏ అవకాశం లేకుండా చేసేదానికే ఈబిల్లు ఉద్దేశింపబడినది తప్ప వేరేమీకాదు. అందుచేతనే కళారూపాలకు యేరకంగా నష్టాలు జరుగుతున్నాసరే కడకు Advisory Committees ను పెట్టమన్నాకూడా పెట్టకుండా ప్రతిజానపదగేయాన్ని, ప్రతినాటకస్వరూపాన్ని, ప్రతి పగటివేషాన్ని, అంటే తరతరాలుగా, వేలకొలది సంవత్సరాలుగా మన ఆంధ్ర భూమిలో వచ్చినటువంటి ప్రతి కళారూపాన్ని విమర్శిస్తూ కళాకారులకు ప్రోత్సాహం లేకుండా, కాంగ్రెసు నాయకులు ఈరోజు తమయొక్క పార్టీ ప్రతి

ష్ఠను కాపాడుకొనే దానికో, లేక పార్టీకార్యక్రమాన్ని కొనసాగించుకొనడానికో, ఎదురుపక్షాన్ని అణచివేసే దానికోసమో ఉద్దేశించి, ఉద్యోగులకు ఇటువంటి హక్కులు యిస్తూ ఈబిల్లును తీసుకొనిరావటం మాత్రం సరికాదు. అందుచేతనే ఈ బుర్రకథపదాన్ని, ఈ జానపదగేయాన్ని దీంట్లోనుంచి మినహాయించవలెను అనే సవరణను నేను బలపరుస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :— అధ్యక్షమహాశయా, ఈ discussion లో fundamental గా mistake జరుగుతోంది. బుర్రకథ నిషేధం అంటే ఏదో ఒక పార్టీని, యెవరినో ప్రత్యేకంగా నిషేధించడానికి ప్రయత్నిస్తున్నట్లుగా భావించి, వాళ్లమనస్సులో ఉన్న భలాని బుర్రకథను నిషేధం చేస్తున్నారనిభయపడుతూ యిప్పుడేదేదోమాట్లాడుతున్నారు.అటువంటి ఉద్దేశమేమి లేదు అనిమాత్రం నేను చెప్పుతున్నాను. 'Singing of even a ballad' నిషేధిస్తారా అన్నారు, సుందరయ్యగారు. Ballads ఎవరైనా prohibit చేస్తారా? కాని ఎప్పుడు prohibit చేస్తారు? గాడ్సే గాంధీగారిని చంపాడు. ఎవరైనా గాడ్సే ధైర్యాన్ని, వీరత్వాన్ని గురించి బుర్రకథ వ్రాసి, ballad చదువుతాను అంటే భారతదేశంలో తలలు బద్దలుగొట్టుతారు, అలాంటివాడిని. Ballad వ్రాసి చదివే హక్కుఉంది అనుకోండి. కాని, 'Father of the Nation' అయిన మహాత్ముని కాల్చినవాడిని పెద్ద hero గా చిత్రించి నేను ballad వ్రాస్తాను, చదువుతాను అంటే ఈదేశంసహించదు. ఇతరదేశాల్లో వుందిలెండి. బ్రతికినంతసేపుఇంద్రుడు. చంద్రుడు అని, మరణించినవెంటనే పనికిమాలినవాడు, బుద్ధిలేనివాడు అని చెప్పేదేశాలు వున్నాయి. కాని దానికినాకు ఆక్షేపణలేదు. భారతదేశంలో మాత్రం అలాంటిదిలేదు. రాముడుకాలం మొదలు ఈ ప్రొద్దుటి వరకు ఎవరైనా National Hero ఉంటే ఆయనను ఎప్పుడూ ఎవరు అవమానపరచినా సహించని భారతదేశం ఇది. అలాంటి దేశంలో ఎవరో గాంధీని గురించో, నెహ్రూను గురించో నేను ballad చదువుతాను నా యిష్టంవచ్చిన బూతులు తిట్టుతాను, వాళ్లను చంపిన వాళ్లనంతా వీరాధివీరులుగా చేస్తాను అంటే ఈ దేశంసహించదు. అలాంటివి indecent గా యేదో యిష్టంవచ్చినట్లు, చేతికి వచ్చినట్లు వ్రాసి ఇతరులకు నొప్పి కలిగేటట్లు వ్రాయవద్దన్నామే గానీ, బుర్రకథలు మీరు చెప్పితే వద్దన్నామా? ఎన్నిచెప్పారు మీరు, ఎన్నికలప్పుడు? ఎన్నికలముందు, తర్వాత ఏదోఉద్రేకపరిస్థితులు వచ్చినప్పుడు నిషేధించవలసి వస్తుందేకానీ, మీరు బుర్రకథలద్వారా ప్రచారం చేస్తామంటే, ఇటుపక్షంగా చేసినా, అటుపక్షంగా చేసినా, కమ్యూనిస్టులు వ్రాసుకొన్నా, కాంగ్రెసువాళ్లు వ్రాసుకొన్నా నిషేధమే పనిగా పెట్టుకొని కూర్చొనేవరు? ప్రజలకు బాధకలిగించేదేమైనా వ్రాసి చేయవద్దు అని ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యమేగానీ, ఇకమీదట పాటలు వ్రాయవద్దండి, నాటకాలు వేయవద్దండి, యేమీ చెయ్యవద్దండి అనికాదు దీని ఉద్దేశ్యం. ఆ రకంగా అన్ని పార్టీలవారూ భావించకండి. కాంగ్రెసువాళ్లు అధికారంలో ఉన్నారుకాబట్టి ఈ విధంగా ఏదోచేస్తున్నారనికాదు. ఆవిధంగా చేయాలంటే ఈ చట్టమే అవసరంలేదు. ఎన్నోమార్గాలు ఉన్నవి. ఇంకా ఎంతో బాగావుండాలనే ఉద్దేశంతో సవరించి, అధికారాలిచ్చి ఎవడో ఒకడు దుర్మార్గంగా ప్రవర్తించకుండా వుండేటట్టుగా High Court కు అప్పీలుయిచ్చి చేస్తున్నశాసనమిది. ప్రభుత్వాన్ని మార్చడానికి కావలసిన అనుకూలాలు అన్నీ ప్రతిపక్షానికిఉన్నాయి. చట్టసమ్మతంగా ప్రభు

త్వాన్ని మార్చడానికి మీరు ఎన్ని బుర్రకథలు వ్రాసినాసరే, దాన్ని ఏమీ చెయ్య డానికి వీల్లేకుండా ఉండేవిధంగా ఇందులో వ్రాశాము. ప్రభుత్వాన్ని విమర్శించండి. అధికారం యిస్తున్నాము. లేదా ఏదైనా లోపాలుఉంటే చెప్పండి. బుఱ్ఱకథలద్వారా చెప్పండి, నాటకాలద్వారా చెప్పండి. వేషాలువెయ్యండి, కాని, వ్యక్తిగతంగా ఈర్ష్యలుపెంచుకొని వాడిని వీడు, వీడిని వాడు తిట్టుకొని రగడలు రక్తపాతం చేసుకోకుండా వుండడానికే యిది ఉద్దేశించాము. ఈ విషయం specific గా చెప్పాము. చట్టసమ్మతంగా ప్రభుత్వాన్ని మార్చడానికిగాని, విమర్శించ డానికిగానీ హక్కువుంది. అది బుఱ్ఱకథల్లోగానీ, నాటకాల్లోగానీ రాదు అని స్పష్టంగా ఇందులో వ్రాశామే. తరువాత ఇదంతా యేమైనా పొరపాటుగా మంత్రులో, అధికార్లో, కలెక్టర్లో తమ ధర్మాన్ని అతిక్రమించి ప్రవర్తిస్తే High Court కు కూడా పోయి appeal చేసుకోవడానికి అనుకూలం ఇచ్చామే. ఇన్నీ చేసినతరువాత ఇంకాభయపడుతున్నారంటే, వారిదృష్టిలో ఏదోఉందన్నమాట. ఫలాని ఎల్లయ్యను జమీందారీ పుల్లయ్యనుగురించి మేము వ్రాసిన బుఱ్ఱకథ తీసేస్తారేమో అని ఏవో అనుమానాలు పెట్టుకొని యివన్నీ చేస్తున్నారు. కాని, అటువంటిభయం వద్దు అని నేను చెప్పుతున్నాను. అలాంటి బుఱ్ఱకథలు మనం మానేస్తే, ఎలాంటి భయమూ పెట్టుకోవాల్సిన అవుసరం ఉండదప్పుడు. కాని, ప్రతిదానిని, మేము వ్రాసినదంతాకూడా ఆడించుకోవాలని వారు భావించడం పొరబాటు. ఏ పార్టీఅయినాసరే ఆ రకంగా భావించడం పొరబాటు. ఈ బుఱ్ఱ కథలసేవి ఉండితీరాలి. నాటకాన్ని ఎప్పుడైతే నిషేధిస్తావో బుఱ్ఱకథనుకూడా నిషేధించాలి అంటే దుర్మార్గమైన బుఱ్ఱకథలు, చట్టానికి విరుద్ధమైన బుఱ్ఱకథలు, తలలు బ్రద్దలుకొట్టుకోవడానికి దారితీసే బుఱ్ఱకథలు ఎవరు వ్రాసినాసరే, కమ్యూనిస్టులు వ్రాసినా, Socialists వ్రాసినా, కాంగ్రెసువాళ్లు వ్రాసినా, అవి తప్పనిసరిగా నిషేధింపవలసిందేనని నేను చెప్పుతున్నాను. కాబట్టి ఈక్లాజును సవరించవద్దని కోరుతున్నాను.

Mr. SPEAKER :—The question is :—

"Delete the words 'or any burrakatha, and includes the singing of any ballad' in sub-clause (3) of clause 2."

The motion was declared lost. A poll was demanded and the House divided thus :—

AYES.

1. Sri Vavilala Gopalakrishnayya.
2. Sri A. Yeruku Naidu.
3. Sri G. Suryanarayana.
4. Sri B. Adinarayana.
5. Sri B. Rathnasabhapathy.
6. Sri M. Nagi Reddi.
7. Sri P. Satyanarayana.
8. Sri Mahammad Tahseel.
9. Sri G. Nageswara Rao.

10. Sri Pillalamarri Venkateswarlu.
11. Sri B. Sankaraiah.
12. Sri S. Vemayya.
13. Sri P. Sundarayya.

NOES.

1. The Hon. Sri N. Sanjeeva Reddi.
2. Sri P. Ranga Reddy.
3. Sri R. Balanarayana Reddy.
4. Sri A. Kaleswara Rao.
5. Sri K. Venkataratnam.
6. Sri Vijaya Bhaskara Reddi.
7. Sri Kalluru Subba Rao.
8. Srimathi B. Rukmini Devi.
9. Sri P. Bapayya.
10. Sri A. Bhagavantha Rao.
11. The Hon. Sri D. Sanjivayya.
12. The Hon. Sri A. B. Nageswara Rao.
13. Sri K. Brahmananda Reddi.
14. Sri S. Brahmayya.
15. Sri J. Chandramouli.
16. Sri Y. Channaiah.
17. Sri N. P. Chengalraya Naidu.
18. Sri Chidambara Reddi.
19. Sri Marupilla Chitti alias Appalaswami.
20. Sri M. Doraikannu.
21. Sri V. Gopalakrishna.
22. Sri T. Gopalakrishnayya. Gupta
23. Sri P. Thimma Reddi.
24. Sri V. Kurmayya.
25. Sri P. Gunnayya.
26. Sri Hanumantha Reddi.
27. Sri T. Jalayya.
28. Sri P. Kodandaramayya.
29. Sri Pragada Kotayya.
30. Sri M. Koti Reddi.
31. Sri L. Lakshmana Das.
32. Sri Divi Kondiah Chowdary.
33. Sri T. Lakshminarayana Reddi.
34. Sri M. Munuswami.

35. Sri E. Nagayya.
36. Sri B. G. M. A. Narasinga Rao.
37. Sri M. Pallam Raju.
38. Sri P. Parthasarathi.
39. Sri M. Pothuraju.
40. Sri E. Ayyapu Reddi.
41. Sri P. Rajagopal Naidu.
42. Sri T. Prakasam.
43. Sri Rajaram.
44. Sri D. Ramabrahmam.
45. Sri T. Ramachandra Reddi.
46. Sri P. Ramacharlu.
47. Sri C. Ramakotaiah.
48. Sri H. Ramalinga Reddi.
49. Sri Bojja Appalaswami.
50. Sri Chowdari Satyanarayana.
51. Sri Reddi Kamayya.
52. Sri K. Santhappa.
53. Sri Rathnam.
54. Sri P. Ramaswami Naidu.
55. Sri G. Ramaswami Reddi.
56. Sri T. Veeraraghavulu.
57. Sri C. P. Thimma Reddi.
58. Sri B. Subba Rao.
59. Sri A. C. Subba Reddi.
60. Sri Shaik Moula Saheb.
61. Sri P. Anthony Reddi.
62. Sri Raja Sagi Suryanarayana Raju.
63. Sri Seshadri.
64. Sri P. Singarayya.
65. Sri Kasim Venkata Reddi.
66. Sri M. Matcharaju.
67. Sri B. Appa Rao.
68. Sri Reddi Jagannadham.
69. Sri A. Lakshmunaidu.
70. Sri V. Kodandarami Reddi.
71. Sri T. N. Venkata Subba Reddi.
72. Sri B. V. Subba Reddi.
73. Sri G. Rami Reddi.
74. Sri P. Venkataravanappa.

(Noes)—(Contd.)

75. Sri P. Venkatasubbaiah.
76. Sri B. P. Sesha Reddi.
77. Sri M. Venkataraju.
78. Sri T. Papa Rao.
79. Sri G. Narasimhamurthi.
80. Sri S. Ranganatha Mudaliar.
81. Sri D. Gopala Rao.
82. Sri R. B. Ramakrishna Raju.
83. Sri P. Narasimhappa Rao.

For the amendment 13.

Against the amendment 83.

The motion was declared lost.

Sri S. VEMAYYA :—For Explanation IV to Clause 2(2), substitute the following :—

"In this clause, 'Government' means the State Government".

'Any State Government' అని చెబుతూ Central Government ను కూడా కలపడం బాగాలేదు. ఇది వెంటనే తొలగించాలని State Government చాలునని నాసవరణ.

The amendment was duly seconded.

Mr. SPEAKER :—The question is :—

"For Explanation IV to Section 2(2), substitute the following :-

In this clause, 'Government' means the State Government."

The motion was lost.

Mr. SPEAKER :—The question is :

That clause 2 do stand part of the Bill.

The motion was carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

The Hon. Sri N. SANJEEVA REDDI :—Sir, I move that the Bill be passed into Law.

Mr. SPEAKER :—Motion moved—

"That the Bill be passed into law".

Sri PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, ఈబిల్లుమీద చర్చలు మనమందరం follow అయినాము. మంత్రివర్గం ఏదృష్టితో తీసుకువచ్చిందో సంజీవరెడ్డిగారు వివరించారు. ప్రమాదం వచ్చినప్పుడు తలకాయలు పగులగొట్టుకునేస్థితి వచ్చినప్పుడు ఈబిల్లు వర్తింపచేయాలని ఉద్దేశమం చెప్పారు. రోజురోజూ జరిగేవాటికి వర్తింపచేయాలని ఉద్దేశంకాదని స్పష్టని

చేశారు. వారి ఉద్దేశాన్ని గౌరవింపవచ్చును కాని ఆచరణలో ఏమిజరుగుతుందనే విషయంమాత్రం పరిశీలన చేయవలసియున్నది. రెండు సంవత్సరాలలో ఏమీ ban చేయలేదుకదా అన్నారు. నిజమే, ban చేయలేదు. సీతారామరాజు బుర్రకథమీద నిషేధం తొలగించారుకూడా, దానికి వారిని అభినందిస్తున్నాను. పోలీసులకు అధికారాలు ఇస్తున్నాం కొన్ని సమయాల్లో నిషేధింపచేయడానికి. ఈరోజున చూస్తున్నాం Prohibition Act ఎట్లా పనిచేస్తోందో. నాగిరెడ్డి నడికుడి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు. త్రాగుతుండేవారిని పట్టుకోవాలంటే పట్టుకోవాలని చెప్పినవారిమీద కేసులు పెడుతున్నాడు అక్కడఉండే సబ్ఇన్స్పెక్టరు కావలిసిఉంటే ఇటువంటివి ఎన్నైనా చూపిస్తాము. కాంగ్రెస్ కమ్యూనిస్టు తగాదా కాదు ఇది. ఎవరు కొంచెం డబ్బుముట్టచెబితే ఆపని చేయడానికి సిద్ధంగా ఉండే సబ్ఇన్స్పెక్టరు అక్కడ ఉన్నాడు. చట్టాలు ఏవిధంగా ఉపయోగపడుతున్నాయి, ఏవిధంగా అమలుజరుగుతున్నాయి అనేదిచూస్తే నేడు ఏఉద్దేశాలకోసమని చెబుతున్నారో ఆఉద్దేశాల ప్రకారమే అమలు జరగడంలేదనేది మీదృష్టికి తీసుకువస్తున్నాను. ఎప్పుడో అరుదుగా ఉపయోగించడానికి ఏచట్టమూ అవసరం లేదు. ప్రమాదమైన పరిస్థితులువస్తే 144 వ సెక్షనుక్రింద నిషేధించవచ్చును. అనేక చట్టాలున్నాయి వెంటనే ఆపుచేయడానికి. సంజీవరెడ్డిగారుకూడాచెప్పారు. అయినా ఈచట్టాన్ని తీసుకువచ్చినారంటే ప్రజలలోను ఉద్యోగస్థులలోను ఏభావం కలుగుతుందంటే ఈ చట్టం వెంటనే అమలుజరపడానికి తీసుకువచ్చినారు కాని dead letter గా ఉంచడానికికాదు అనిపిస్తుంది. నేడుఉండే పరిస్థితులను మరిచిపోకూడదు. ఎక్కడచూసినా పార్టీకక్షలేకాకుండా గ్రామకక్షలు అనేకంఉన్నాయి. ఈచట్టాన్ని ఆకక్షలలో పలుకుబడి ఉన్నవారు ఉపయోగించడానికి ప్రయత్నిస్తారని సంజీవరెడ్డిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. ఈచట్టాన్ని దుర్వినియోగం చేయడానికి అవకాశం ఉన్నదని చెబుతున్నాను. Advisory Committee అయినా ఉంటే కళలకు సంబంధించినట్టివారి సలహాలు తీసుకోనడానికి వీలు ఉంటుంది. అన్ని పార్టీల విశ్వాసాన్ని చూరగొనాలన్నా, నిష్పాక్షికంగా వ్యవహరించాలన్నా obscene గా ఉండేవాటిని నిషేధింపచేయాలని ఉద్దేశం ఉన్నట్లయితే తప్పనిసరిగా ప్రజల విశ్వాసం వస్తుంది. Advisory Committee ఏర్పాటుచేసినట్లయితే. ఎవరైనా పలుకుబడిఉన్నవాళ్లు Sub-Inspector దగ్గరకో Circle Inspector దగ్గరకో కలెక్టరుదగ్గరకో వెళ్లి బుర్రకథను పెడుతున్నారు, దానిని ban చేయాలని చెప్పడానికి అవకాశం ఉన్నది. వీటన్నింటిని ఆలోచించి కనీసం advisory body ని rule making power లో నైనా వేయాలని కోరుతున్నాను. అనేక amendments తీసుకువచ్చాను. ఈరోజున జమీందారీలు ఉన్నాయా లేదా అనేది technical విషయం. కళావెంకట్రావుగారు నష్టపరిహారంక్రింద వేలాది ఎకరాలు భూములను ఇచ్చి రద్దుచేశామని చెప్పారు. ఆదృష్టిలో రద్దుఅయినట్లు అంగీకరించవచ్చును. భూస్వాములకు కూలీలకు ఉండే తగాదాలు, పెట్టుబడిదార్లకు కార్మికులకు ఉండే తగాదాలు చూస్తున్నాము, ఉన్నవి లేవని ఏవిధంగా కళ్లుమూసుకుని ఉండడమో తెలియడంలేదు. నేను రెచ్చగొడతాననో మరొక ఎల్లయ్య రెచ్చగొడతాడనో కాక ఉన్నవిషయాలను గమనించాలి. ఈ నాడు గ్రామాల్లో భూస్వాములు, వ్యవసాయ కూలీలున్నారు. చిన్నరైతులుకూడా ఉన్నారనుకోండి. ప్రధానంగా ఉండే తగాదాలు మేము చెబుతున్నాము. కార్మి

కులు- ఏ sugar mill కార్మికులో, ఏ సిమ్మెంటుమిల్లు కార్మికులో- ఏమ ప్రచార పద్ధతులలో బుర్రకథలు పెట్టుకుంటే, దానిమీద పెట్టుబడిదారు కార్మికులను రెచ్చగొడుతున్నారనే కారణంపెట్టి నిషేధించాలని కలెక్టరువద్దలో Sub-Inspector వద్దరో చెప్పి నిషేధింపచేయవచ్చును. అప్పుడు వద్దని చెప్పడానికి వీలు ఉన్నదా? కాశేశ్వరరావుగారు ఎలక్షన్లు, ఎలక్షన్లు అని ఎప్పుడూ ఆలోచిస్తుండడంవల్లనే శాసనసభలో సరిఅయిన దృక్పథం తీసుకోనలేక పోతున్నారు, బయట అయితే వేరుగా చెప్పగలుగుతారు.

సామూహికంగా కార్మికులు, పేదప్రజానీకము ఎక్కువగా ప్రచారము చేసుకుంటారు. మనం అందరంకూడా వారినిగురించి చెబుతున్నాము గనుక వారికి మేలుకలుగుతుందని ఆశిద్దాము. వారు ప్రచారముచేసుకోవడానికి ఈ బిల్లువల్ల అభ్యంతరము వస్తున్నదని చెబుతున్నాను. ఇది ఏపార్టీకిగాని, ఏ ఒక్క ముఠాకు వ్యతిరేకంగా ఉపయోగిస్తున్నారనేదిలేదు. జనరలుగా ఈ బిల్లులో ఉన్నటువంటి provisions వల్ల వచ్చే ఫలితము ఏమిటో అసలు దాని ఉద్దేశ్యం ఏమిటి అని ఈరోజున మనం ఖచ్చితంగా ఆలోచించవలసిందని నేను చెబుతున్నాను. అసలు ఈబిల్లు అంతా సరిగా పరిశీలించిచూస్తే 124 వ సెక్షనుకు borrow చేసి దానికి apply చేస్తున్నారన్న విషయం స్పష్టంగా కనిపించుతున్నది. ఏవో కొన్ని పరిస్థితులు వచ్చాయి వాటిని save చేయుటకొరకు స్వంతంగా ప్రాశాము అనే దృక్పథము ఎక్కడా కనిపించడములేదు. ఆవిధంగా ఈ బిల్లులో అనేక లోపాలు ఉన్నాయి. ఇది ఆచరణలోకి వచ్చేప్పటికి ఇంకా చాలా ప్రమాదాలకు దారితీసే అవకాశాలు ఉన్నాయి. మీకు వ్యతిరేకంగా ఉపయోగిస్తున్నామని మీరు ఎందుకు అనుకోవాలని సంజీవరెడ్డిగారు అంటున్నారు. మాదృష్టిలో ఏదో బుర్రకథ ఒకటి ఉన్నఎనికూడా అన్నారు. అటువంటిది ఏమీలేదు. కూలీలుగాని, రైతులుగాని, ఏ ప్రజానీకము అయినాసరే ఈరోజున ఒక సమస్యనుగురించి ఆలోచించేప్పుడు, అది పరిష్కారముకానిచో దానిమీద కొంత ఉద్రేకపడవచ్చును. ఈ రోజున మనకు విశాలాంధ్ర వస్తున్నదని ధైర్యముతో ఉండబట్టి సరిపోయిందిగాని, లేకపోతే దానికోసము బుర్రకథలద్వారానేకాదు, ఇంకా అనేక రూపాల్లో ఆందోళనలు చేయడానికి మనము పూనుకొని ఉండేవాళ్ళము. ప్రభుత్వాధికారంలో సంజీవరెడ్డిగాని లేక యింకా ఏ ఎల్లయ్యగాని, ఏ పుల్లయ్యగాని ఉంటే వారు వాటినన్నింటినీ నిషేధించడానికి ఈబిల్లు అవకాశము ఇస్తున్నది. ఈ బిల్లువల్ల అలాంటిప్రమాదాలు ఇంకా ఎన్నో ఉన్నాయి. రూల్సుద్వారా కొన్ని fundamental rights కూడా పోయే ప్రమాదము ఉన్నది. ఇది మాకు వ్యతిరేకంగా ఉన్నది కాబట్టి మేము భయపడుతున్నామని కొందరు సభ్యులు అన్నారు. అటువంటి భయములేనేలేదు. ఎవరూ, ఎవరికీ భయపడవలసిన అవసరంలేదు. అటువంటి భయాలను పురస్కరించుకొని ఈరోజున మనం బిల్లును pass చేస్తున్నామా? ఒకచట్టముచేస్తే దానివల్లవచ్చే ఫలితం ఏమిటి? దానివల్ల ఎవరికి ఎక్కువగా ప్రయోజనము కలుగబోతున్నదనే విషయమునుమాత్రమే ఆలోచించాలని నేను మంత్రివర్గానికి, సంజీవరెడ్డిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఏదో ఒక పార్టీని దృష్టిలో పెట్టుకొని, ఒక బుర్రకథను దృష్టిలోపెట్టుకొని ఇటువంటి బిల్లులు తయారు చేయడం సబబుగాలేదు. సర్వప్రజానీకాన్ని దృష్టిలోపెట్టుకొని ఈ బిల్లువల్లవచ్చే ప్రయోజనము ఏమిటని ఆలోచించాలి. ఈరోజున పెద్దపెద్ద జమీందార్లు, భూస్వా

ముల, పెట్టుబడిదారుల ప్రచారపద్ధతులు వేరుగా ఉండవచ్చును. బుర్రకథలు మొదలైనవి పేదప్రజానీకముయొక్క ప్రచారపద్ధతులు. దీనిని నిషేధించాలంటే సంజీవరెడ్డిగారిదగ్గరకు రానక్కరలేదు. ఏ పోలీసు కానిస్టేబులు అయినా అక్కడకు వెళ్లి ఇది వేయడానికి వీలులేదు అంటే దానిని ఆపివేయవలసినదే. ఈ నిషేధాన్ని తొలగించుకోవడానికిమాత్రము సంజీవరెడ్డిగారిదగ్గరకు రావాలి. ఇవి ఈనాడు ఉండే పరిస్థితులు. ఈ నిషేధించే అధికారం పోలీసు **Head constables** కు పూర్తిగా ఉన్నది. ఎక్కడఅయినా ఒక బుర్రకథ అసభ్యప్రవర్తనలో వేస్తున్నారంటే ఆయనవచ్చి ఇది వేయకూడదంటే, అక్కడ ఎంత ప్రజానీకంచేరి ఉన్నా, అది ఏపార్టీకి సంబంధించివున్నా వారంతా దానిని ఆపి నెత్తిన గుడ్డవేసుకొని వెళ్లవలసినదే. ఇటువంటి పరిస్థితులలో ఈబిల్లును ఎందువల్ల తీసుకువచ్చారని అడుగుతున్నాను.

ఏదో అత్యవసరమైన పరిస్థితులలో గ్రామములలో కమ్యూనల్ తగాదాలు ఏవో ఉంటాయి. అక్కడ ఇటువంటి ప్రదర్శనలు వేయడానికి వీలులేదని చెప్పి మనం ఒక సెక్షను ప్యాసుచేసేందుకు అవకాశాలు ఉన్నాయి. ఇటువంటి చట్టములు తీసుకురావడంవల్ల ప్రజలకు లేనిపోని అనవసరమైన ఇబ్బందులను కలిగిస్తున్నాము తప్ప మరేమీలేదని మనవిచేస్తున్నాను. అందువల్ల బుర్రకథలు ఎవరువేస్తున్నారు, ఏవిధంగా వేస్తున్నారు అనేది సమస్యకాదు. అసభ్యమైన పదాలుగల బుర్రకథలు ఎవరువేస్తున్నాసరే వాటిని తప్పకుండా నిషేధించాలిసిందే. అందువల్ల ఈబిల్లును నేను అంగీకరించలేకుండా ఉన్నాను. అడపా తడపా తెచ్చే బుర్రకథలకు ఈబిల్లు ఎందుకు అన్నారు.

**The Hon. Sri N. SANJEEVA REDDI** :— నేను ఆమాట అనలేదు, ఒకసభ్యుడు ఉపయోగించారని అన్నాను.

**Sri PILLALAMARRI VENKATESWARLU** :— మీరు ఉపయోగించారనిచెప్పి నేను అంటున్నాను. ఈబిల్లులో ఆవిధంగానైనా ఏమైనా వ్రాశామా ? సామాన్య ప్రజానీకం అంతాకూడా అనుసరించే కళారూపాలన్నీ తీసుకువచ్చి దీంట్లో బొందపరచినాము. దానివల్ల సామాన్య ప్రజానీకమునకు చాలానష్టము కలుగుతుందని చెబుతున్నాను. అందువల్ల దీనిని **impliment** చేసినప్పుడు అయినాసరే అటువంటి ప్రమాదములు రాకుండా, సంజీవరెడ్డిగారు అధికారంలో ఉన్నంతవరకు అటువంటి **instructions** పంపించి ఆ ప్రకారంగా చేస్తారని ఆశిస్తున్నాను.

**Sri B. SANKARAIAH** :— అధ్యక్షా, ఈ బిల్లును **clause by clause** చర్చించేప్పుడు దీంట్లోవున్న కొన్నివిషయాలను ఎట్లా దుర్వినియోగము చేయడానికి వీలుంటుందో మీదృష్టికి తీసుకువచ్చాము. ఇటువంటివి మా జిల్లాలో అనేకసందర్భాలలో జరిగినాయి. ఇటువంటివాటివల్ల సభాస్వాతంత్ర్యాన్నికూడా హరించడానికి వీలున్నదని తెలియజేస్తున్నాము. మొన్నఎన్నికలు అయిన తరువాత ఒక పర్యాయం ఆలోచిస్తే కమ్యూనిస్టులని చెప్పుకొనడానికి ౬ నెలలవరకు వీలులేకపోయింది. ఎక్కడ అయినా బుర్రకథలలోగాని, ఏ సమావేశములలోగాని, ఎక్కడయినా నలుగురు కూర్చొని మాట్లాడినప్పుడుగాని ఇది న్యాయము అని, ఇదిఅన్యాయము అని విచక్షణ లేకుండా "ఒక గడ్డివాము నాదికాదు అనుకుంటే మీరం

తా కొవ్వూరు జైలులో ఉంటారు" అనేవిధంగా చాలాచోట్ల జరిగాయి అని ప్రభుత్వ దృష్టికి తీసుకు వస్తున్నాను. ఇట్లామాట్లాడేందుకు వీలులేనప్పుడు, బుర్రకథలు పెట్టితే దానిని ఎట్లాదుర్వినియోగం చేస్తారో సంజీవరెడ్డిగారే చెప్పారు. ఇప్పుడుప్రభుత్వాన్ని విమర్శించడానికి వీలులేకుండా, ప్రభుత్వాన్ని కించపరచడానికికూడా వీలులేకుండా ఈ బిల్లువల్ల చేశారు. ఆవిధంగా ఒకవర్గమునకు మరొకవర్గమునకు మధ్య వాళ్ల యొక్క సమస్యలను చెప్పేదానికి వీలులేకుండా, అదిద్వేషము అనిచెప్పి ఇంకొక చోట వ్రాసిఉన్నది. అందువల్ల ఇటువంటివన్ని ఉపయోగించుకొని ప్రభుత్వాన్ని విమర్శించకూడదని ఒకచోట ఉన్నమాట వాస్తవమే. ఇంకొకచోట కించపరచకూడదు అని ఉన్నప్పుడు దానిని అవకాశంగా తీసుకుంటారా? తీసుకోరా? అటువంటివి తీసికొన్నప్పుడు తరువాత అయినా వాటిని ఆలోచించడానికిగాని, నిజంగా ఆ కథలోగాని, అటువంటివి ఉన్నాయా లేవా అని విచారించకుండా అప్పటికప్పుడు నిషేధించడానికి విపరీతమైన అధికారాలు ఇచ్చారు. ఎక్కడైనా ఒక పెద్ద సమావేశము జరపాలంటే, ఆ చుట్టుప్రక్కల వారం పది రోజులపాటు తిరిగి ఏర్పాటుచేసుకోవాలి. అట్లాచేసుకుంటే ఆనిముషంలో అక్కడ అది పెట్టకూడదు అని దానిమీద నిషేధిస్తే, అట్లా 1, 2 పర్యాయములు దానిని నిరుత్సాహ పరచినప్పుడు-ఆవిధంగా వేయడానికి వీల్లేనప్పుడు, అది అందరికీ కూడా నిరుత్సాహము అయిపోయి, ఎక్కడయినాసరే ఇదొక మార్గము ఉన్నది. మీరు ఎక్కడకూడా ఈ ప్రదర్శనము వేయనీయకుండా చేయవచ్చును. ఈరోజున ఎవరుఅయితే ప్రజలు ముందుకు రాకుండా లోపాలంటున్నారో, ఎవరు అయితే ప్రజల్లో చైతన్యం వస్తే భయపడుతున్నారో, అటువంటివారు లేరని సంజీవరెడ్డిగారు చెప్పినప్పటికి కూడా 10 గ్రామములకు ఒకరో, 20 గ్రామములకు ఒకరో, రాయలసీమలో ఉండవచ్చును. డెల్టాతాలూకాలో గ్రామానికి 10 మంది 20 మంది ఉండవచ్చును. అటువంటివారు లేరని అనుకునేదానికి వీలులేదు. ఈరోజున ప్రజలు ఇట్లాగే అణిగి ఉండాలనే వాళ్లుఅనేకమంది వున్నారు. వారు దానిని దుర్వినియోగ పరచేందుకు చేసే ప్రయత్నాలు అరికట్టడానికి ప్రభుత్వం రూల్సులో ఏవిధంగా చేస్తారో, ఆచరణలో రోజురోజుకు ఎట్లాదుర్వినియోగ పరిచేదికూడా చూస్తారు. అందువల్ల దీనిని ఎట్లాదుర్వినియోగ పరచకుండా చూస్తారో, ఇక ఆచరణలో రుజువు చేయాలి. ఇప్పటివరకు ఎన్నిసవరణలు చేసినప్పటికి వేటినీ ఆమోదించనందుకు విచారిస్తున్నాను. దుర్వినియోగం చేయకుండా ఏమి చర్యలు తీసుకుంటారో తెలియజేయాలనికూడా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

**Sri P. NARASIMHAPPA RAO** :— అధ్యక్షా ! ఇప్పుడు సంజీవరెడ్డిగారు తెచ్చినబిల్లును నేనుపూర్తిగా బలపరుస్తున్నాను. కాని మనసోదరులు కొంతమంది ఈ సందర్భంలో ఎందుకు బాధపడుతున్నారో నాకేమీ అర్థంకావడంలేదు. పూర్వంనుంచి కళలున్నాయి. ఆకళలు కొన్ని ముక్తికోసం, కొన్ని రక్తికోసం వున్నాయి. కొంతమందికి **enjoyments** కోసమని కొన్నికథలున్నాయి. కాని మనసోదరులు పట్టుపట్టి ఏమైనాసరే అదివుంటేనే గాని అని **propaganda** చేయడం అనేది ఎందుకో నాకేమీ అర్థంకావడంలేదు. ఇప్పుడు ఒకచోట రామాయణం చెప్పడానికి యేర్పాటుచేసినచో, రామాయణం వింటే మోక్షముందని చెప్పి కొంతమంది వస్తారు. అలాగే యింకోచోట బుర్రకథ పెట్టండి. బుర్రకథలో ఏముందిరా బుర్ర అని మనపెద్దలంటారు. ఇటువంటప్పుడు బుర్రకథను గురించి వీరుయింత

పట్టుపట్టడము ఎందుకో నాకేమీ అర్థంకావడంలేదు. మొన్నటి elections సందర్భంలో మావైపునకూడా ఒక బుర్రకథ జరిగింది. అందులో కొట్లాటలు జరిగాయి. ఇప్పటికి యింకా పోలీసు కేసులు జరుగుతూనే వున్నాయి. ఒక విద్యా ప్రవీణుడు వచ్చి తన విద్యా ప్రవీణతను చూపుతుంటే రెండవ ప్రక్కన బుర్రకథ పెట్టితే అందరూ బుర్రకథ దగ్గరకే వెడతారు కాని విద్యా ప్రవీణతను చూసేవారులేరు. బుర్రకథ దగ్గరకు పోవడం అక్కడ కొట్టుకోవడం తప్ప వేరే ఏమీ కనిపించుటలేదు. కాని బుర్రకథలు కావాలని రైతులు, కూలీలు గోలపెడు తున్నారా అంటే అటువంటిదేమీలేదు. రైతులకు వ్యవసాయం, హెచ్చుపంట, ఆ పండినపంటకు ధరకావాలి. కూలీలు రూపాయి కూలియిచ్చేచోట యింకా అర్ధరూపాయి ఎక్కువ యివ్వండి అని అడుగుతారు కాని వారికి బుర్రకథ అక్కర లేదు. ఈబుర్రకథలు చూడ్డంవల్ల వాళ్లకు వచ్చేదేమీ లేదుకాని సోమరితనం వస్తుంది. 24 గంటలూ వాడు బుర్రకథ దగ్గరకు వెడితే వాడి జీవనాధారం పోతుంది. వాడి యింటిదగ్గర భార్యా పిల్లలు ఆకలితో ఏడుస్తూఉంటారు. కాని కూలి పని చేసుకుంటే 1 రూపాయికూలి వస్తుంది. బుర్రకథకు వెడితే ఏమీరాదు. ఈబిల్లుకు కమిటీ అవసరంలేదు. ఇది వెంటనే pass చేయమని కోరుతూనేను విరమిస్తున్నాను.

**Sri L. LAKSHMANA DAS** :—అధ్యక్షా! ఈబిల్లును తీసికొని వచ్చి నందుకు నేను సంజీవరెడ్డిగారికి అభినందనలర్పిస్తున్నాను. అసలు మనం విజ్ఞానాన్ని డ్రామాలద్వారా, బుర్రకథలద్వారా అధికంచేసుకోడానికి బదులు విద్వేషాలను పెంచుకొంటున్నాము. అంతేగాక దేశం అభివృద్ధిచేసుకోడానికి ఈ పంచవర్ష ప్రణాళికలు అమలుజరుపు కొంటున్న ఈసమయంలో విద్వేషాలకు తావులేకుండా యిటువంటి బుర్రకథలను, నాటకాలను, నిషేధించడానికి ప్రభుత్వం పూనుకొని యీ శాసనం తెచ్చిన మంత్రివర్గాన్ని అభినందిస్తున్నాను. కాని ప్రభుత్వం మరి సినిమాలు, యితరత్రా జరుగుతున్న విషయాలుకూడా ఆలోచించి వీలుంటే దీనికి amendments కొద్దికాలంలో తీసుకురావాలని కోరుతూ, ప్రభుత్వాన్ని అభినందిస్తూ నేను విరమిస్తున్నాను.

**Sri E. AYYAPU REDDI** :— అధ్యక్షా! ఈబిల్లును నిశితంగా పరిశీ లించిన పిమ్మట ప్రతిపక్ష సభ్యులుచేసిన విమర్శలు సహేతుకంగా లేవని చెప్ప డానికి సంశయముండదు. ఆర్థిక సమస్యలను పరిష్కరించుకొనుటకైతేనేమి, సంఘంలో వున్న ఇతర సమస్యలను పరిష్కరించు కొనుటకయితేనేమి యీచట్టం ఏమాత్రమూ అడ్డంరాదని నేను మనవిచేస్తున్నాను. భూస్వామ్యవిధానం రద్దు చేసుకొనుటకుగాని, జమిందారీ విధానాన్ని రద్దుచేసుకొందుకుగాని, లేక సం ఘంలో వున్న యితర సమస్యలను పరిష్కరించుకొనుటకైతేనేమి, బుర్రకథలను, డ్రామాలను ఉపయోగించుకోవచ్చును అనేదానికి యీబిల్లులో ఎలాంటి నిషేధం లేదు. ముఖ్యంగా భూస్వాములపైన, వర్గంపైన, వ్యక్తిగతంగా విద్వేషాలను రెచ్చగొట్టడాన్ని యీబిల్లు నిషేధిస్తుంది. ఈ సందర్భంలో గాంధీ మహాత్ముని నాయకత్వంక్రింద జరిగినటువంటి పోరాటాన్నికూడా మనం గుర్తుకు తెచ్చుకోవాలి. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని 50 సంవత్సరాలుగా ఎదుర్కొన్నాము. కాని బ్రిటిష్‌వారిపైన ద్వేషాన్ని ఎన్నడూ రెచ్చగొట్టుకోలేదు. తెల్లవారు ఎక్కడ కని పించితే అక్కడ చంపాలని, వార్ని హింసావిధానాలలో హింసించాలనీ, అలాంటి

విధానంలో మనం బ్రిటిష్‌వారిని ఎన్నడూ ఎదుర్కోలేదు. అదే విధంగా భూస్వాములను గురించిగాని, సంఘంలో వున్నటువంటి యితరసమస్యలను గురించిగాని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు సహేతుకంగా, సక్రమంగా ఎదుర్కొన్నాము. బుర్రకథలనైనా, డ్రామాలనైనా ఉపయోగించుకోడానికి ఈబిల్లు ఎంత మాత్రం ఆక్షేపణకరంగాలేదు. ఆంధ్రదేశంలో అయితేనేమి, తెలంగాణాలో అయితేనేమి యింతకుముందు జరిగినటువంటి (terrorist activities) హింసాకాండలు గుర్తు చేసుకొంటే అటువంటి (terrorist activities ను) హింసాకాండలను, నిషేధించవలసిన అవసరం ఎంతైనావుంది. కొన్నికొన్ని బుర్రకథలు కృతిమించి వ్యక్తులపైన విద్వేషాన్ని రెచ్చగొట్టుతున్నాయి. గత ఎన్నికలలో ఉపయోగించినటువంటి పార్టీవ్యక్తులు యితరవ్యక్తులపైన విద్వేషాన్ని రెచ్చగొట్టి చాలా ప్రమాదకరమైన పరిస్థితులకు దారితీసినారు. నా స్వానుభవంలో ఒక ఉదాహరణ చెప్తాను, కమ్యూనిస్టులకు అత్యంత ముఖ్యస్థానమైన వెలుగోడు గ్రామానికి కాంగ్రెసువారు పోయి సుందరయ్యగారిపైన వ్యక్తిగతంగా విమర్శచేస్తూ "పుచ్చలాపల్లికి పిచ్చి కుదరాలంటే" అంటూ ఒకపాట పాడారు. అప్పుడు అక్కడున్న వారంతరూ రెచ్చిపోయి కొట్టుకోడం జరిగింది. అట్లావ్యక్తులపైన ఒకవర్గంపైన ద్వేషాన్ని రెచ్చగొట్టడం, అనేదాన్ని ఈచట్టంద్వారా నిషేధిస్తున్నాము. రాజ్యాంగ చట్టంలో మనకు కొన్ని ప్రాథమికమైన హక్కులు చేకూర్చివున్నారు. రాజ్యాంగచట్టంలో వున్నటువంటి **fundamental rights** కు విరుద్ధంగా యీచట్టంలో ఏలాంటివైరుధ్యంలేదని నేను ప్రతిపక్షు సభ్యులకు మరొకసారి విన్నవిస్తున్నాను. కేవలం రాజకీయమైనటువంటి ప్రజలకోసమే కాకుండా యీ బుర్రకథలను ప్రమాదపరిస్థితులకు దారితీసేటట్లుగా వ్రాసి, ప్రమాదాలు తెచ్చేందుకు అవకాశాలున్నాయి. ఇప్పుడు విశాలాంధ్ర విషయంలోను, బళ్లారి విషయంలోనూ ఉద్రేకపూరితమైన బుర్రకథలువ్రాసి ప్రచారం సాగించినట్లయితే విపరీతమైన, విషాదకరమైన సంఘటనలకు దారితీయగలవు. కాని క్రమమైన ప్రచారానికి యీ బిల్లు ఏమాత్రం అడ్డంరాదు. కాని అక్రమమైన పద్ధతులలో **terrorist activities** కు వలె ప్రజలలో విద్వేషాన్ని రెచ్చగొట్టేటప్పుడు మాత్రం ప్రభుత్వానికి ఈ ప్రచారాన్ని నిషేధించే హక్కు ఈ బిల్లులోవున్నది. ఈ బిల్లును నేను సమర్థిస్తూ విరమిస్తున్నాను.

**Sri D. KONDAIAH CHOWDARY :—** అధ్యక్షా, ప్రభుత్వంవారు యీ బిల్లు తీసికొనివచ్చినందుకు వారిని నేను అభినందిస్తున్నాను. ఈ బిల్లువిషయంలో ప్రతిపక్షు సభ్యులు చేసినటువంటి విమర్శలు చూస్తే వారు పొరపాటు పడుతున్నారేమోనని, అంతేకాకుండా గుమ్మడికాయలదొంగ అంటే, భుజములు తడువుకొన్న మాదిరిగా ప్రవర్తిస్తున్నారు. ప్రతిచిన్న విషయాన్ని గురించి దుర్వినియోగ మవుతున్నదని వారికి సందేహం యేర్పడుతున్నది. ప్రతి చట్టంలోకూడా నిషేధించేటటువంటి శాసనాలు దుర్వినియోగం చేయడానికి అవకాశం వుండనేవుంటుంది. ఇప్పుడు దొంగతనం చేయకూడదని మనం శాసించాము అనుకోండి. అంతమాత్రంచేత ఇది దుర్వినియోగం చేయబడుతుంది కాబట్టి తీసెయ్యండి అనేటట్లుగా ఉన్నది ఈ ప్రతిపక్షుసభ్యులు చేసేవాదన. అది దుర్వినియోగం చేయబడితే తగున్యాయస్థానాలున్నాయి. ఈ బిల్లుదుర్వినియోగం చేయబడుతోంది కాబట్టి రద్దుచేయవలసిందని న్యాయస్థానాలకు పోవడానికి అవకాశాలున్నాయి. న్యాయస్థానాలమీద నమ్మకం లేనటువంటి వ్యక్తులు చేయవలసిన

విమర్శనలు న్యాయస్థానాలమీద సమ్మకంగల యీ కమ్యూనిష్టులు చేస్తున్నారు, అలాంటిఅపోహాలు పడవద్దని నేను వారికి మనవిచేస్తున్నాను. విజ్ఞానాన్ని వెదజల్లడానికి పురాతనం నుంచి అమలులో వున్నటువంటి విషయాలను యిప్పుడు నిషేధిస్తున్నామని యిందాక నాగిరెడ్డిగారు చెప్పారు. ఇది విజ్ఞానాన్ని వెదజల్లితే పరవాలేదు. ఒక రుజు ప్రవర్తన, నీతివంతమైన ప్రవర్తన ధర్మపద్ధతిని ప్రచారంచేసేటటువంటి పద్ధతులు కావాలి. ఇదివరకు బుర్రకథలు ప్రచారంలోకి రానప్పుడు వీధి భాగవతాలు ఉపయోగపడుతూ వచ్చేవి. స్త్రీలుగాని, పురుషులు గాని, సంఘంగాని నీతివంతమైన పద్ధతులు, శీలం, న్యాయమార్గాన్ని ప్రభోదించేటటువంటి విషయంలో యింతవరకు మనపూర్వులు యీ మార్గాలద్వారా ప్రజలలో ప్రవేశపెట్టారు. ఇప్పుడు యీ బుర్రకథలు విజ్ఞానాన్ని పెంచడానికి బదులు అజ్ఞానాన్ని పెంచుతున్నాయి. అందుచే యీ బుర్రకథలను యిప్పుడు నిషేధించవలసిన అవసరమేర్పడింది. అంతేకాదు ప్రతి బుర్రకథకూడా నిషేధించబడిందని యిందాక మంత్రిగారు చెప్పికూడా యీ రకంగా ఇది పొరపాటు మార్గంలో పెడుతున్నది అనడం యేమాత్రం సబబుగా లేదని మనవి చేస్తూ యీ బిల్లును సమర్థిస్తున్నాను.

**Sri P. SUNDARAYYA :—** అధ్యక్షా, ఈ చర్చ వినేకొద్దీ యీ బిల్లు చాలా ప్రమాదకరమైనదని స్పష్టంగా తెలుస్తున్నది. సంజీవరెడ్డిగారు ఒక సవరణ మీద మాట్లాడుతూ జమీందారులు, భూస్వాములు ఎప్పుడూ వుండేవారు. రోజు రోజూ గ్రామాలలో చిన్నరైతులు కోరినవన్నీ నెరవేరేవి. అటువంటప్పుడు యీ రెచ్చగొట్టడాలను ఆపుచేసేందుకే యీచట్టం తెస్తున్నామని చెప్పారు. భూస్వాములే కాకపోవచ్చును. జమీందారులేకాకపోవచ్చును. వారిదృష్టిలో చిన్నరైతులే కాకపోవచ్చును. వారు ఉదయంనుంచి సాయంకాలంవరకు చమటోడ్చి కష్టపడి పనిచేసి, నాగలి తీసుకొని దున్నేటటువంటివారు రైతులుగానే కనబడకపోవచ్చును. మాదృష్టిలో అటువంటి చిన్నరైతులు వ్యవసాయకూలీలను పెట్టుకొనరు. వ్యవసాయమునకు కూలీలను పెట్టుకొనే అధిక సంఖ్యాకులంతా కూడా సోమరిపోతులై తమ పొలాలుకూడా ఎక్కడ వున్నాయో తెలియని స్థితిలో ఉంటారు. ఒకపూటకూడా పనిచేయనివారు వ్యవసాయకూలీలను ఎక్కువగా పెట్టుకుంటారు. వాళ్లు రెండుపూటల గంజి త్రాగేదానికి కావలసిన కూలీ ఇవ్వమన్నట్లయితే ఇవ్వకుండా ఉన్నప్పుడు ఈరోజున మేమేదో వర్గద్వేషాన్ని రెచ్చగొడుతున్నామని అంటారు. వర్గద్వేషం పుట్టుకతోనే వస్తుంది. ఎవరైతే తన్ను దోచుకుంటున్నారో ఆ దోచుకొనే మనిషిమీద, దోచుకొనే వ్యక్తులమీద, దోచుకొనే వర్గంమీద దోచుకొనబడేటటువంటి ప్రజలకు, వ్యవసాయకూలీలకు, పేదలకు ఆరనటువంటి కోపము ఉంటుంది. మేము చేసేదిఅంతాకూడా ఇటువంటి పరిస్థితులలో ఈవర్గదోపిడిని అరికట్టాలి. ఈ వర్గదోపిడి ఉన్నంతకాలం దేశంలో శాంతి ఉండదు. అశాంతికే దారితీస్తుందని మేమేదో బుర్రకథలు చెపితే వర్గద్వేషాన్ని రెచ్చగొడుతున్నామంటారు. వర్గద్వేషం అన్నది ఈరోజు క్రొత్తగావచ్చినదికాదు. గత 100, 150 ఏండ్లుగా కమ్యూనిస్టుపార్టీ ప్రపంచంలో పుట్టినపుడు వచ్చిన కట్టుకథ తప్ప ఇంకొకటికాదు. గ్రామసీమలలోని పరిస్థితులు, పట్టణాలలోని ఫాక్టరీ యజమానులకు కూలీలకు సరైనటువంటి సౌకర్యములు కలుగజేయకుండా ప్రభుత్వ చట్టాలు మూలపెట్టి, అక్కడకూలీలు సమ్మెలుచేస్తూవుంటే, పెట్టుబడిదారులు ఈరీతిగాకూలీ

లను, కార్మికులను దోచుకుంటూ ఉన్నంతకాలం దేశంలో శాంతివుండదు. ఈదోపిడి విధానం అంతం కావాలని ఉన్నది ఉన్నట్లు వాస్తవంగా మేము చిత్రిస్తే అది వర్గ ద్వేషాన్ని రెచ్చగొడుతోందని చెప్పి ఇటువంటివి నిషేధించేదానికోసం ఈ నాటకాలనుగాని, ప్రదర్శనలుగాని నిషేధించడం ఈ బిల్లుయొక్క నిజస్వరూపం స్పష్టంగా కనబడుతోంది. సంజీవరెడ్డిగారు ఈసంగతి చెప్పుచూ మహాత్మాగాంధీని ఖూనీచేసినటువంటి Godse అనే మహావీరుని పొగుడుతున్న ఎవరినైనా భారతదేశం సహిస్తుందా అని అడిగారు, ఏమాత్రం సహించదు. ముఖ్యంగా దేశనాయకుని ఖూనీ చేసేటటువంటి దానికోసమే ప్లానుకొన్నటువంటి వాళ్లమీద తప్పకుండా చర్యలు తీసుకునేందుకు కావలసిన హక్కులు ప్రజలకు ఉన్నాయి. ఈ సందర్భంలో వారు Godse ని గురించి వారు చెప్పినపుడు నేను వారికి వినయపూర్వకంగా ఒక సంగతి జ్ఞాపకము చేస్తున్నాను. Godse ఏ R. S. S. సంస్థకు చెందాడో ఆ R. S. S. సంస్థతో, గాంధీమహాత్ముని ఖూనీచేసేదానికి కొన్నిరోజులకు పూర్వమే, దురదృష్టవశాత్తు కాంగ్రెస్‌లో ఒక మహానాయకుడైనటువంటి వల్లభాయ్‌పటేల్ రాజీచేసుకొని R. S. S. సంస్థను ప్రోత్సహించిన సంగతి కాంగ్రెస్‌నాయకులు ఒకపర్యాయము జ్ఞాపకము చేసుకొన్నట్లయితే!

The Hon. Sri N. SANJEEVA REDDI: I emphatically protest. It is utter untruth.

Sri P. SUNDARAYYA: It is not a lie. It is truth.

There were many cries of 'withdraw', 'withdraw'.

Mr. SPEAKER: Order; Order.

Sri P. SUNDARAYYA: I don't withdraw it.

The Hon. Sri N. SANJEEVA REDDI: We cannot tolerate.

Sri P. SUNDARAYYA: మీరు tolerate చెయ్యడం చెయ్యకపోవడం అనే దానితో నాకు నిమిత్తంలేదు.

The Hon. Sri N. SANJEEVA REDDI: It is nonsense. I know your level.

Sri P. SUNDARAYYA: మీ సంగతికూడా నాకుతెలుసు.

Mr. SPEAKER: Order; Order. The hon. Member may go to the next point.

Sri P. SUNDARAYYA: అందుచేత (Interruption)

Sri D. KONDAIAH CHOWDARY: On a point of order, Sir. When the Speaker is on his legs, it is gentlemanly behaviour on the part of the members of all parties to sit down and resume seats. It is not good for any man to disobey the order of the Chair

Mr. SPEAKER: The hon. Leader of the Opposition may carry on.

Sri P. SUNDARAYYA :— అందుచేత వాస్తవాన్ని గుర్తించిన వారు Godse ని పొగుడుతున్నారనిచెప్పి దానిని ఆపుచెయ్యటానికి చట్టాలు తేవడం అనేది అర్ధంలేని వాదంతప్ప ఇంకొకటేదికాదు. ప్రభుత్వానికి కావలసినన్ని చట్టాలున్నాయి. ఇటువంటి విద్రోహశక్తులను అణచివేసేశక్తి I. P. C. 151 సెక్షనులో ఉన్నది, 124 Section లో కూడ ఉన్నది. 151 సెక్షనుక్రింద, 124 సెక్షనుక్రింద ఈ మినహాయింపులు ఉన్నప్పటికికూడా మామూలుగా తన నిర్బంధవిధానం కొనసాగించాలని పూనుకొంటున్నది. ఉన్న వాస్తవాన్ని కప్పిపెట్టుకొని, అసలుసంగతి చెప్పినపుడు మంత్రిగారు మహాకోపపడితే నేను వారికి ఒక విషయము చెప్పాల్సి ఉన్నది. ఆఖరికి జవాబుచెప్పే అధికారం వారికి ఉన్నది. దానిమీద కొన్ని అభాండాలు మామీద వేసినా వెయ్యవచ్చు. గాండ్రింపులకు మీ బెదిరింపులకు జంకుతామని అనుకోవడం పొరపాటు. (Interruption) మీరు జంకరు. మేము జంకము, ఇది ఇద్దరికి తెలిసిన సంగతే. మీరొకవర్గానికి ప్రతినిధులు, మేమొక వర్గానికి ప్రతినిధులము. మీరు కోపపడినంత మాత్రాన ఎవరు అబద్ధంచెప్పేది దేశానికి కనబడుతూనే ఉన్నది. మీరు మహా సత్యసంధులైనట్లు, హరిశ్చంద్రులైనట్లు మాట్లాడినంతమాత్రాన సరిపోయేదికాదు. అందుచేత ఈ బిల్లు ప్రతిపక్షాన్ని అణచేదానికొరకు, దేశంలో రాజకీయ ప్రచారం కొనసాగకుండా చేసేదానికొరకు తెచ్చినటువంటి దురుద్దేశపుబిల్లు గనుక దీనిని మేము వ్యతిరేకిస్తున్నామనిమాత్రం చెపుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :- అధ్యక్షా, ఈ ఉపన్యాసానికి సమాధానం చెప్పవలసిన అవసరమేలేదు. ఈబిల్లుయొక్క నిజస్వరూపం బైటపడింది అన్నారు. అతని దుర్మార్గాలను సమర్థించే అవకాశం ఉండదేమోనని ఇదిఅంతా చేస్తున్నారు. కనీసం ఇక్కడెక్కడఉన్నవారిసంగతి మాట్లాడినాపరవా లేదు. స్వర్గంలో ఉన్నటువంటి సర్దార్ వల్లభాయ్‌పటేల్‌పైన అభాండాలు వేయడంవల్ల మనిషియొక్క నిజస్వరూపం బయటపడిందనిమాత్రం చెపుతున్నాను.

Mr. SPEAKER :—The question is :

"That the Bill be passed into law."

The motion was declared carried.

Sri P. Sundarayya demanded a poll and the House divided thus :

AYES.

1. The Hon. Dr. B. Gopala Reddi
2. The Hon. Sri N. Sanjeeva Reddi
3. The Hon. Sri D. Sanjivayya
4. The Hon. Sri A. B. Nageswara Rao
5. Sri P. Ranga Reddy
6. Sri K. Balanarayana Reddy
7. Sri A. Kaleswara Rao
8. Sri K. Venkataratnam
9. Sri Vijaya Bhaskara Reddi

10. Sri K. Subba Rao
11. Srimati Ammanna Raja
12. Srimati B. Rukmini Devi
13. Sri P. Bapayya
14. Sri A. Bhagavantha Rao
15. Sri A. V. Bhanoji Rao
16. Sri K. Brahmanda Reddi
17. Sri S. Brahmayya
18. Sri J. Chandramouli
19. Sri Y. Channaiah
20. Sri N. P. Chengalraya Naidu
21. Sri Chitambara Reddi
22. Sri Marupilla Chitti alias Appalaswamy
23. Sri M. Doraikannu
24. Sri V. Gopalakrishna
25. Sri T. Gopalakrishnayya Gupta
26. Sri S. B. P. Pattabhi Rama Rao
27. Sri P. Thimma Reddi
28. Sri V. Kurmayya
29. Sri N. Venkataramaiah
30. Sri P. Gunnayya.
31. Sri T. Jalayya
32. Sri P. Kodandaramayya
33. Sri D. Kondaiah Chowdary
34. Sri Pragada Kotaiah
35. Sri M. Koti Reddi
36. Sri K. V. Krishnavatharam
37. Sri L. Lakshmana Das
38. Sri T. Lakshminarayana Reddi
39. Sri M. Munuswami
40. Sri E. Nagayya
41. Sri B. G. M. A. Narasinga Rao
42. Sri M. Pallam Raju
43. Sri P. Parathasarathi
44. Sri M. Pothu Raju
45. Sri C. Ayyapu Reddy
46. Sri P. Rajagopal Naidu
47. Sri T. Prakasam
48. Sri B. Rajayya
49. Sri Rajaram

2nd March 1956] (Ayes)—(Contd.)

50. Sri D. Ramabrahmam
51. Sri T. Ramachandra Reddi
52. Sri P. Ramacharyulu
53. Sri C. Ramakotaiah
54. Sri B. Ramakrishna Reddi
55. Sri H. Ramalinga Reddi
56. Sri P. Ramaswami Naidu
57. Sri G. Ramaswami Reddi
58. Sri Ratnam
59. Sri K. Santappa
60. Sri B. Appalaswami
61. Sri A. Satyanarayanamurti
62. Sri P. Anthony Reddi
63. Sri Raja Sagi Suryanarayana Raju
64. Sri N. C. Seshadri
65. Sri P. Singarayya
66. Sri B. Subba Rao
67. Sri A. C. Subba Reddi.
68. Sri Sheik Moula Saheb.
69. Sri C. Subbarayudu.
70. Sri C. P. Thimma Reddi.
71. Sri T. V. Raghavulu.
72. Sri B. P. Sesha Reddi.
73. Sri M. Venkataraju.
74. Sri G. Rami Reddi.
75. Sri B. V. Subba Reddi.
76. Sri P. Venkataramanappa.
77. Sri P. Venkatasubbaiah.
78. Sri A. Lakshminaidu.
79. Sri V. Kodandarama Reddi
80. Sri T. N. Venkata Subba Reddi
81. Sri Reddi Jagannatham
82. Sri M. Matchiraju
83. Sri K. Venkata Reddi
84. Sri B. Appa Rao
85. Sri R. B. Ramakrishna Raju
86. Sri P. N. Appa Rao
87. Sri C. V. Suryanarayana Raju
88. Sri S. Ranganatha Mudaliar
89. Sri D. Gopala Rao

90. Sri G. Narasimha Murthi
91. Sri T. Papa Rao.
92. Sri N. Sreenivasa Rao.

NOES.

1. Sri Vavilala Gopalakrishnayya
2. Sri B. Adinarayana
3. Sri G. Suryanarayana
4. Sri A. Yeruku Naidu
5. Sri P. Sundarayya
6. Sri Pillalamarri Venkateswarlu
7. Sri S. Vemayya
8. Sri B. Sankaraiah
9. Sri G. Nageswara Rao
10. Sri P. Satyanarayana
11. Sri S. Kasi Reddi
12. Sri Mahammad Tahseel
13. Sri M. Nagi Reddi

AYES : 92; NOES : 13.

The motion was carried and the Bill was passed into law.

Mr. SPEAKER: Now, the Hon. Chief Minister will present the Budget for the year 1956-57.

## II. PRESENTATION OF THE BUDGET FOR THE YEAR 1956-57.

## 1956వ సం॥ మార్చి 2వ తేదీన ఆంధ్రశాసన సభలో 1956–57 వ సం॥పు బడ్జెట్ ప్రతిపాదించు ఆర్థిక శాఖా మాత్యులైన ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి ఉపన్యాసం.

The Hon. Dr. B. GOPALA REDDI :—

అధ్యక్షా !

1956–57 వ సంవత్సరానికి ఆంధ్రరాష్ట్ర బడ్జెట్‌ను యీ సభలో ప్రతిపాదిస్తున్నాను. ఇది నేను ప్రతిపాదించు రెండవ బడ్జెట్. మనందరం ఆశిస్తున్నట్లుగా సత్వర విశాలాంధ్ర నిర్మాణం జరిగితే, ప్రస్తుత ఆంధ్ర రాష్ట్రానికి యిదే చివరి బడ్జెట్‌కూడా అవుతుంది.

2. గత జూలైలో నేను బడ్జెట్ ప్రవేశపెట్టిన తర్వాత, రాజకీయరంగంలో, దేశ భవిష్యత్తును ప్రభావితం చేయగల రెండు ప్రధాన సంఘటనలు జరిగినవి; ఒకటి, ద్వితీయ పంచవర్ష ప్రణాళికారచన, రెండు రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం వారి నివేదిక. ఇందులో మొదటిది ప్రజావసరాలకు, దేశ ఆర్థిక సౌభాగ్యానికి సంబంధించింది; రెండోది, ఒకేభాష, ఒకే సంస్కృతి కలిగిన ప్రజానీకాన్ని ఒకే పరిపాలనా వ్యవస్థక్రింద ఉంచాలనే ప్రజాహృదయాలలోని గాఢ వాంఛకు నిదర్శనం. ప్రణాళికారచన కొద్ది మందిలో ఆలోచనలు రేకెత్తించింది; కాని రాష్ట్ర పునర్నిర్మాణ సమస్య బహుళప్రజానీకంలో ఉద్రేకాలను రెచ్చగొట్టి యిరుగు పొరుగు రాష్ట్రాలలో పరస్పర అనుమానాలకు దారి తీసింది. ఇరుగు పొరుగు వారిలో స్నేహ సౌహార్ద భావాలన్నీ ఒక్క రోజులో మాయమైపోయినవా అనిపించింది.

3. తెనుగు భాష మాట్లాడే ప్రజలందర్నీ ఒకేరాష్ట్ర పరిపాలనక్రిందికి తీసుకురావాలని కోరుతూ మన శాసనసభ తీర్మానించిన విషయం మీకుతెలుసు. ఈ కోరికలో రాష్ట్రీయ సంకుచిత దురభిమానంగాని, సామ్రాజ్యవాద తత్వంగాని ఏమాత్రంలేదు. ఇది ఒకేభాష మాట్లాడే ప్రజల్లో, వేరైపోయిన స్థితినుండి మరల కలుసుకోవాలని కలిగే సహజ వాంఛ మాత్రమే. దురదృష్టవశాత్తు భారతదేశ చరిత్రలో, నిరంతర యుద్ధాలవల్లనైతేనేమి, ఆనాటి కొందరు పాలకులదురాశా ప్రేరణవల్ల నైతేనేమి, దేశంలోని ప్రజలు చీల్చబడి, కృత్రిమ సరిహద్దుల్లో బంధింపబడినారు. ఈ కృత్రిమ విభాగానికి కారణం, వారందరు కలసికట్టుగా ఏకలక్ష్య సాధన దిశలో పురోగమింపడానికి, అంతరాయం కలిగించడమే. అటు కోలారులో, యిటు ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో నివసిస్తున్న తెలుగు ప్రజల సంస్కృతి వికాసాన్ని నిశితంగా పరిశీలిస్తే, ఒక విభిన్నత్వం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ తెలుగు ప్రజలందరు ఒకే పరిపాలనక్రింద ఉన్నట్లయితే వారిలో

* English version of the speech of the Hon. Dr. B. Gopala Reddi is printed as an Appendix at pages 384 infra

యింత విభిన్నత ఏర్పడి ఉండేదికాదు. నన్నయ, తిక్కన, బమ్మెర పోతన, అల్లసాని పెద్దన, రామరాజ భూషణుడు మొదలగు మహామహుల పాదరేణువులచే పవిత్రమైన తెలుగుభూమి ఏక ఖండంగా ఉండాలనీ, ప్రజలందరు తమ జాతీయ గీతానిను ఏకోన్ముఖంగా పాడుకోవాలనీ మనం కోరుకుంటున్నాము. విశాలాంధ్ర లర్మాణంలో అనేక సాధక బాధకాలు ఉన్నై; మనమీద అనేక బాధ్యతలు ఉన్నై; అనేక విషయాల్లో మనం యితరులతో సరిపెట్టుకోవలసి వస్తుంది. మన రాష్ట్ర సరిహద్దులు విశాలమైనకొద్దీ, వెనుకబడిన ప్రాంతాలు, వెనుకబడిన ప్రజానీకాన్ని అభివృద్ధి చేయవలసిన బాధ్యతలుకూడా పెరుగుతై. ఈ అభివృద్ధి సాధించలేని పక్షంలో మనలో నిస్పృహ వ్యాపిస్తుందికూడా.

4. మన రాష్ట్రప్రజల అవసరాలు నానాటికీ పెరిగిపోతున్నవి. ఒక ఎలిమెంటరీస్కూలు కట్టించమనో, రోడ్డు వేయమనో, ఆసుపత్రి పెట్టించమనో అడిగే రోజులు పోయినై. ఈనాడు ప్రజలు కోరుతున్నది—కళాశాలలు, పాలిటెక్నిక్ పాఠశాలలు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి, మంచినీటి సప్లయి, మురుగు పారుదల సౌకర్యాలు, పంపుసెట్లు, బుల్‌డోజర్లు, పశు వైద్యశాలలు మన అవసరాలు మిన్నంటుతున్నై; కాని వాటిని తీర్చుకునే సాధన సంపత్తి యింకా అడుగునే ఉంది. ప్రజావసరాలకు, వాటిని తీర్చుకునే అవకాశాలకూ ఎంతో తేడా ఉంది. దీనివల్ల ప్రజానీకంలో నిస్పృహ ఏర్పడుతుంది. కాబట్టి మన అవసరాలను తీర్చిదిద్దుకోడానికి కావలసినమేరకు మన సాధన సంపత్తిని అభివృద్ధి చేసుకుని, కోర్కెలను అచిరకాలంలో సిద్ధింపజేసుకోడానికి నిరంతరకృషి చేయడమే నేటి మన కర్తవ్యం. మన సాధన సంపత్తి వృద్ధికానిదే, నిత్య జీవితావసరాలనుకూడా సాధించుకోలేమని మనం స్పష్టంగా గుర్తించుకోవాలి. మనం కష్టించడానికి వెనుకాడితే, మన యెదుటనే జరిగే నిత్యజీవిత విషాద సంఘటనలను, నిస్సహాయులమై చూడటం తప్ప మరేమీ చేయలేము. దారిద్ర్యం, దౌర్భాగ్యం, వ్యాధులు, నిరక్షరాస్యత మొదలైన దుస్థితులు విషసర్పాల్లా పడగలు విప్పి మనముందు వికృత నృత్యాలుచేస్తూ యావత్ప్రజానీకాన్ని భయపెట్టి నిరాశా మహాసముద్రంలోకి నెట్టుకుపోతవి. భారతదేశ చరిత్రలో అతి ప్రధానమైన నేటికాలంలో ఉండికూడా, యీ దారిద్ర్యం మొదలగు ప్రజాశత్రువులమీద కత్తిగట్టి, వీరులమై వాటిని ఎదుర్కొని నిర్మూలించలేమా? ఈ గడ్డుకాలంలో మన ధర్మాన్ని మనం నిర్వర్తించకపోతే, రాబోయే తరాలవారు మనల్ని దూషిస్తారు; భవిష్యత్తు మనం తప్పుచేసి వెళ్లామని ఎత్తిపొడుస్తుంది. సోషలిస్టు తరహా సమాజ నిర్మాణానికి మనం కంకణం కట్టుకున్నాం; అందువల్ల ఉన్నవారికీ, లేనివారికీ మధ్యగల తేడాలను తగ్గించడం మన ప్రధాన కర్తవ్యం. సోషలిస్టు తరహా సమాజస్థాపన క్రమంగా, నెమ్మదిమీదగాని జరుగదు. ఈ మహాలక్ష్యాన్ని, రాబోయే 25 సంవత్సరాలకాలంలో ఎట్టి దుర్ఘటనలు లేకుండా శాంతియుత పద్ధతుల్లో సాధించుకోగలిగితే మనల్ని మనమే అభినందించుకోవచ్చు. ఇందులో ఎవర్నీ మోసంచేసే ఉద్దేశం లేదు. ఇది మనలో మనం ఆలోచించుకుని వేసుకొన్న నిర్మాణపథం. ఇంపీరియల్ బ్యాంకు, జీవితభీమాలను జాతీయంచేస్తూ తీసుకున్న నిర్ణయాలు, మన లక్ష్య గమనంలో ఒక ముఖ్య సోపానం. వారసత్వ ఆస్థి పన్నుల విధింపుకూడా యిదే లక్ష్యంతో జరిగింది ఎస్టేటు డ్యూటీ చట్టం వ్యవసాయ సంబంధమైన ఆస్తులకుకూడా వర్తించేట్లు మనం చర్యలు తీసుకున్నాం. దేశీయ సంపద సమానంగా పంపిణీ కావడానికి ఈ చర్య తోడ్పడుతుంది.

భూమి శిస్తు విధానాల చరిత్రలో మొదటిసారిగా క్రమాభివృద్ధి పన్ను పద్ధతిని మనం ప్రవేశపెట్టాం. శతాబ్దాలనుండి సమాన సారవంతమైన భూములకు ఒకే శిస్తు రేటు చెల్లించే విధానానికి మన అలవాటుపడి ఉన్నాం. భూమి శిస్తుమీద క్రమంగా పెరిగే సర్ చార్జీని విధించడంద్వారా, పెద్ద భూస్వాములు ఎక్కువ శిస్తు కట్టవలసివస్తుంది. ఈ చర్యతో మనం సమాన శిస్తు రేటు విధానానికి స్వస్తి చెప్పాం. ప్రభుత్వానికి దీనివలన కొంత ఆదాయం లభించడమేకాక, కొద్దిమంది చేతుల్లోనే ఎక్కువ భూమి ఉండే పద్ధతికి యిది విరుగుడుగా పనిచేస్తుంది. భూమికి సంబంధించినంతవరకు మన ఆర్థిక విధానాన్నికూడ యిదే సూచిస్తున్నది. ప్రణాళికా సంఘం, రాష్ట్రప్రభుత్వంవారి పరిశీలనలోగల అనేక భూసంస్కరణ చర్యలకుకూడ యిదే నాంది. ఒక వ్యక్తికి ఉండవలసిన భూమి గరిష్ట పరిమితి, భూమి కవులుకు యివ్వబడితే, భూస్వామికి కవులుదారునుండి ఎంత రావాలి, ఆహార పంటలకంటే అధికాదాయాన్ని యివ్వగల వ్యాపారపంటలు పండించిన భూస్వామి ప్రభుత్వానికి ఎంత శిస్తు కట్టాలి, మొదలైన విషయాలు ప్రస్తుతం ప్రభుత్వ పరిశీలనలో ఉన్నాయి.

5. 1953 వ సం॥ అక్టోబరు 1 వ తేదీనుండి 1955 వ సం॥ మార్చి 31 వ తేదీ వరకు మన రాష్ట్ర ఆర్థిక పరిస్థితి క్లుప్తంగా ఒకటో అనుబంధంలో చూపబడింది. ఉమ్మడి మదరాసురాష్ట్రం 1953 వ సం॥ జులైలో ప్రజలవద్ద తీసుకున్న 4% అప్పులో మన వాటాకు వచ్చిన రూ 2.45 కోట్లు తప్ప, రాష్ట్రం ఏర్పడిన మొదట్లో, మరేవిధమైన ఆర్థికస్తోమతూ లేదు. అర్థ సంవత్సరానికి రివిన్యూ ఖాతాలో రు 1.14 కోట్లు తరుగు ఏర్పడింది. నీటి పారుదల, విద్యుచ్ఛక్తి, వగైరా యితర ప్రణాళికక్రింద పెట్టుబడి ఖర్చులు, అప్పులు, అడ్వాన్సులక్రింద నికరఖర్చులు కలిసి రూ 375 లక్షలు అయింది. ఈ సంవత్సరంలో రూ. 2.71 కోట్లఖర్చు అంచనాతో కృష్ణానదిమీద రెగ్యులేటర్ బ్రిడ్జి నిర్మాణపు క్రొత్తనీటి పారుదల ప్రణాళిక ఆమోదించబడింది. వివిధ ప్రయోజనాల నిమిత్తం కేంద్ర ప్రభుత్వంనుండి రూ 6.65 కోట్లు అప్పు తీసుకున్నాం. బియ్యం సప్లయి చేయగలందులకు ఇతర రాష్ట్రాలు చెల్లించిన అడ్వాన్సుల రూపంలో చాలాడబ్బు సమకూడింది. రివిన్యూ ఖాతాలో తరుగును, పెట్టుబడి ఖర్చులు వగైరాలను సరిపుచ్చుకొనగా సంవత్సరాంతానికి 8 కోట్లరూపాయల నిల్వతేలింది.

1954-55 వ సం॥లో ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని అభివృద్ధి కార్యకలాపాలమూలంగా చాలా ఖర్చులు పెట్టవలసివచ్చింది. అందువల్ల రివిన్యూ ఖాతాలో రూ. 5.18 కోట్లు లోటు కనిపించింది. పెద్ద పెట్టున, ముఖ్యంగా విద్యుచ్ఛక్తి పథకాలక్రింద, పెట్టుబడి ఖర్చుచాలా జరిగింది. బియ్యంమీద కంట్రోలు పూర్తిగా రద్దు చేయబడినందున పూర్వ సంవత్సరములో ఇతర రాష్ట్రాలనుండి తీసుకున్న అడ్వాన్సు మొత్తాలు ముదరా ఇవ్వవలసి వచ్చింది. వీటన్నిటినీ సర్దుకోడానికై యూనియన్ ప్రభుత్వంవద్దనుండి జాతీయ ప్రణాళికాఋణం వాటా బాపతు రూ. 2.5 కోట్లతోసహా, మొత్తం రూ. 13.62 కోట్లు అప్పుగా తీసుకోబడింది. ఈ మొత్తంలోనుండి ఆ సంవత్సరం కేంద్రప్రభుత్వానికి యివ్వవలసిన బాకీలు సర్దవలసివచ్చింది. కాగా యీ జమాఖర్చులుపోను కొద్దిమొత్తం—రూ. 85.87 లక్షలు మాత్రమే సంవత్సరాంతంలో మిగిలింది. ఆ సంవత్సరమే గుంటూరులో ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకంగాహైకోర్టు, తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, ప్రారంభింపబడినవి.

6. మొదట్లో బడ్జెట్ తయారు చేసినప్పుడు ఆదాయం రూ. 21.98కోట్లు, వ్యయం రూ. 25.64 కోట్లు అని అంచనా వేయబడింది; సవరింపబడిన అంచనాల ప్రకారం, ఆదాయం రు. 22.39 కోట్లు, ఖర్చు రూ. 26.37 కోట్లు అవుతున్నది. బడ్జెట్‌లో రివిన్యూఖాతాలో రూ.3-66 కోట్లలోటు సవరింపబడిన అంచనాలో రు.3.98 కోట్లవరకు పెరిగింది. కొన్ని పన్నుల విధానములవలన, భూమిశిస్తు, అమ్మకంపన్నుల నుండి హెచ్చు ఆదాయం వస్తుందని ఆశిస్తున్నాం. మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి సప్లయి విస్తరణవల్లకూడా అధికాదాయం లభించవచ్చు. అయితే మిగతాకొన్ని పద్దులక్రింద కలిగే తరుగులమూలంగా యీ అధికాదాయముల నికర ప్రయోజనం కొంత వరకుసన్నగిలుతుంది. రివిన్యూపద్దుక్రింద ఖర్చుపెరిగే అవకాశంఉంది. ముఖ్యంగా నీటిపారుదల సౌకర్యాలు, ఋణం మీదవడ్డీ, మొదలైనవాటిలో ఖర్చుపెరిగి ప్రజారోగ్యం, వగైరాకొన్ని పద్దులక్రింద తగ్గుతుంది.

పెట్టుబడి ఖర్చు

ఆయా ప్రాంతాల్లో పనులు వేగంగా, చురుగ్గా సాగుతున్నందు వలన, నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రిందజరిగే పెద్దమొత్తాల ఖర్చులవలన, పెట్టుబడి ఖర్చు నీటిపారుదల పద్దుక్రింద అధికమైంది. అయితే విద్యుచ్ఛక్తిక్రింద ఖర్చు తగ్గినందున ఇది కొంతవరకు సర్దుబాటయింది.

అప్పులు అడ్వాన్సులు

అప్పులు, అడ్వాన్సులు పద్దుక్రింద యివ్వవలసిన నికరపు మొత్తం పెరగ వచ్చు; స్వల్పాదాయవర్గాల గృహనిర్మాణ ప్రణాళికలక్రింద పురపాలక సంఘాలకు అప్పులనిచ్చే ఏర్పాటువల్ల, చేనేత సహకార సంఘాలకు అప్పులక్రింద ఎక్కువ కేటాయించినందువల్ల, యీ పెరుగుదలసంభవం.

ఆర్థికావకాశాలు

వివిధ ప్రయోజనాల నిమిత్తం కేంద్రప్రభుత్వం నుండి లభించగలదనుకొన్న అప్పు మొత్తం రూ. 17.71 కోట్లు. ఇదికాక రూ. 4.95 కోట్ల ఋణం ప్రజలనుండి సేకరించబడింది. ఈమొత్తాలను, జమకట్టుకొని, రివిన్యూ ఖాతాలోటు, పెట్టుబడి ఖర్చు, అప్పులు అడ్వాన్సులు వగైరా ఖర్చులతో సరిచూసుకుంటే, సంవత్సరాంతానికి చాలా కొద్దిమొత్తం—రూ. 58.13 లక్షలు నిల్వ తేలుతుంది.

కాలమాన పరిస్థితులు:

7. ఈ సంవత్సరంలో వానలు మామూలుగాకంటె చాల ఎక్కువగా కురిసినవి. నైఋతి ఋతుపవన కాలములో రాయలసీమలాంటి మెట్టప్రాంతాల్లో సైతం వానలు పుష్కలంగా కురిశాయి. అంతేకాదు, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలలో కొన్నిప్రాంతాల్లో వరదల మూలంగా పంటలుకూడా పాడైనవి. ఈ అధిక వర్షాల వలన కర్నూలు జిల్లాలో ప్రత్తి, వేరుశెనగ పంటలకు దెబ్బతగిలింది. ఇవి మినహా, రాష్ట్రంలోని పైరు పంటలపరిస్థితి సంతృప్తికరంగానేఉంది.

ధరల తీరులు:

8. 1955 వ సం॥ ఏప్రిల్, మే నెలల్లో ఆహార ధాన్యాల టోకు ధరలు తగ్గి, తరువాత క్రమంగా పెరిగినవి. 1955 వ సం॥ డిసెంబరులో ఆహార ధాన్యాల ధరలు, 1954 వ సం॥ డిసెంబరు ధరలకంటె 13 పాయింట్లు పెరిగినై. వాణిజ్యవస్తువుల టోకు ధరలుకూడా పైచూపులోనే వున్నవి. 1954 వ సం॥ డిసెంబరు ధరలకంటె 1955 వ సం॥ డిసెంబరు ధరలు 6 పాయింట్లు ఎక్కువగా ఉన్నై.

ధరల స్థిరీకరణప్రణాళిక:

9. రైతులకు సరసమైన కనీస ధరలు గిట్టుబాటు అయ్యేవిధంగా, వడ్లు, బియ్యం ధరలను నిలబెట్టడానికై యీ పంట తరుణంలో ముదుగురకం ధాన్యానికి ధరల స్థిరీకరణ విధానాన్ని వర్తింపజేయడానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించింది. తత్ఫలితంగా రాష్ట్ర ప్రభుత్వం తన కొనుగోలు ఏజెంట్లద్వారా కొన్ని రకాల

ముదుగు ధాన్యాన్ని వ్యవసాయదారుల వద్దనుండి కొనడానికి ఏర్పాట్లు చేసింది. వడ్లధర మణుగు 1కి ఏడు రూపాయలకంటె తక్కువకుపడిపోతే, ఈ ఏర్పాట్ల ప్రకారం ప్రభుత్వ ఏజెంట్లు గ్రామంలోనే రూ 7 ల ధరకు ఆధాన్యాన్ని కొంటారు. అయితే ఈ పథకం క్రింద అట్టి కొనుగోలు చేయవలసిన అవశ్యకత యింతవరకు ఏర్పడలేదు.

భూసంస్కరణలు:

10. రాష్ట్రంలో భూసంస్కరణల పరిశీలనకై ఒక సంఘాన్ని నియమించిన సంగతి గౌరవనీయ సభ్యులకు తెలిసేవుంది. 1955 వ సం॥ అక్టోబరు చివరలో యీ సంఘమువారు తమ నివేదికను సమర్పించారు. ఈ నివేదిక ప్రస్తుతం ప్రభుత్వ పరిశీలనలో వుంది. భూసంస్కరణల సంఘము చేసిన సిఫార్సులను క్షుణ్ణంగా పరిశీలించిన మీదట, తగు ప్రతిపాదనలు చేయబడుతవి.

11. యుద్ధకాలములో, తదనంతరము ట్రెజరీల పని అన్ని శాఖల విస్తరణమూలంగా అధికమైంది. ఇందునిమిత్తమై అదనపు సిబ్బంది మంజూరు చేయబడింది. కాని అనుభవమున్నవారు లభించలేదు. పైగా ట్రెజరీలలోని గుమాస్తాలు అక్కౌంటెంట్లు తఱచు రెవిన్యూ శాఖలోని ఇతర ఉద్యోగములకు బదలీ చెయబడ్డారు. తత్ఫలితంగా ట్రెజరీలలోని అక్కౌంట్సు సిబ్బందిలో సుమారు సగం మంది అనుభవంలేనివారే అయ్యారు. తీవ్రమైన అక్రమాలు, జాప్యాలు ట్రెజరీలలో కానవచ్చినవి. కాబట్టి రెవిన్యూ సిబ్బందినుంచి ట్రెజరీ అక్కౌంట్సును వేరు చేయటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ట్రెజరీ అక్కౌంటెంట్ల జీతపు ప్రమాణాలు ఈస్కీముక్రింద హెచ్చింపబడుతవి. ట్రెజరీ సహాయకాధికారులచే కొత్త ఉద్యోగస్థాయి ఏర్పాటు చేయబడుతుంది. ఈ కొత్త ఏర్పాటులవలన ట్రెజరీల నిర్వహణ చాలావఱకు అభివృద్ధి చెందగలదని ఆశించవచ్చు.

ప్రథమ పంచ వర్ష ప్రణాళిక:

12. ఈ సంవత్సరానికి బడ్జెట్ ప్రతిపాదిస్తూ, మనరాష్ట్ర ప్రథమ పంచవర్ష ప్రణాళికనుగురించి ప్రస్తావించి ఉన్నాను. ప్రణాళికలో చేర్చబడిన ప్రధానఅభివృద్ధి పథకాలు, ప్రతిదానికి అయ్యే ఖర్చు అంచనాలు, 1954-55 వ సం॥నికి జరిగిన ఖర్చు వివరం, 1955-56వ సం॥నికి అయ్యేఖర్చు అంచనాలు వగైరా వివరాలు అయిదవ అనుబంధంలో చూపబడినవి. మన జల సంపదలో చాలా భాగం యింతవరకు తగినంతగా సద్వినియోగం కానందున, మన ప్రణాళికలో విద్యుచ్ఛక్తి, నీటి పారుదల కార్యకలాపాలకు అత్యధిక ప్రాముఖ్యము లభించడము సహజము. భారీ ప్రాజెక్టులేకాక, కరువు ప్రాంతాల శాశ్వత సౌకర్యార్థం, యితర యిరిగేషన్ పథకాలుకూడా ప్రణాళికలో చేర్చబడినవి. అంతేకాక కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణ శాఖవారు సూచించిన కార్యక్రమాన్ని అనుసరించి, కమ్యూనిటీ అభివృద్ధి కార్యకలాపాలకు, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలకుకూడ తదితరములతోపాటు ప్రణాళికలో అవకాశం చూపబడింది. అయిదవ అనుబంధంలో చూపిన విధంగా ఖర్చు అంచనా రూ 69.62 కోట్లు కాగా 1954-55 వ సంవత్సరాంతానికి, రూ 47.04 కోట్లు ఖర్చు పెట్టబడింది. 1955-56 వ సం॥ చివరకు రూ 65.08 కోట్లు మొత్తం ఖర్చు జరుగుతుందని అంచనా. పోతే అప్పటికి రూ 4.34 కోట్లు మాత్రం మిగిలి వుంటుంది.

13. ఐదేండ్ల కాలంలో జాతీయాదాయాన్ని 25% పెంచడమూ, సుమారు 80 లక్షలమందికి జీవనభృతి కల్పించడమూ, లక్ష్యాలుగా జాతీయప్రణాళిక

రూపొందించబడింది. ఇందుకు అవసరమైన సాధన సంపత్తిని సమకూర్చుకునేందుకు తీసుకోవలసిన చర్యలనుకూడా ప్రణాళిక సూచించింది.

**ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక:**

మన రాష్ట్ర ద్వితీయ పంచవర్ష ప్రణాళిక గ్రామ స్థాయినుండి తయారు చేయబడింది. సాధ్యమైనంత తక్కువ కాలములో నికరాదాయాలను రెట్టింపు చేయడం ప్రణాళిక లక్ష్యం. సమగ్రమైన ప్రజాసహకారం ప్రాతిపదికగా మన గ్రామ ప్రణాళికలు రూపొందించబడి, జిల్లా ప్రణాళికలతో సమన్వయ పరచబడినవి. జిల్లా ప్రణాళికలు రాష్ట్ర స్థాయిలో తయారైన ప్రణాళికలతో జోడింపబడినవి. దేశం మొత్తంమీద లభ్యంకాగల సాధనసంపత్తి దృష్ట్యానూ, రాష్ట్రస్థాయిలో మనం సమకూర్చుకోగల సాధనసంపత్తి దృష్ట్యానూ, ప్రణాళిక అనేక మార్పులకు లోనైనవిషయం గౌరవనీయ సభ్యులకు తెలుసుగదా ! కేవలం ధనవసతులు మాత్రమేకాదు, మన సమస్య ; వివిధ పథకాలను అమలు పరచడానికి అవసరమైన వస్తుసామాగ్రిని, సుశిక్షితులైన కార్యకర్తలను సమకూర్చుకోవడంలోగల యిబ్బందులు మన అభివృద్ధి గమనమునకు అడ్డుపడుతున్నవి. ప్రస్తుతం మన ప్రణాళిక అంచనా రూ 1,16.2 కోట్లు. ప్రణాళికలో యిప్పటివరకు చేర్చబడిన కార్యక్రమాలు తాత్కాలికములు మాత్రమే. ప్రతి సంవత్సరము మనకు లభ్యమైన సాధన సామాగ్రిదృష్ట్యానూ మనం సాధించగలిగిన విజయాల దృష్ట్యానూ, ఆయా కార్యక్రమాలను పునఃపరిశీలించుకోవలసి వుంటుంది. ఒక్కొక్క సంవత్సరంలో అమలు చేయవలసిన కార్యక్రమాలమీదనే దృష్టి కేంద్రీకరించబడుతుంది ; పోతే భవిష్యదభివృద్ధి విషయంలో, మరునటి సంవత్సరపు కార్యకలాపాలకే ప్రణాళికకృషి పరిమితమై వుంటుంది.

ప్రథమ ప్రణాళికలోలాగానే, ద్వితీయ ప్రణాళికలో గూడా, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి పథకాలకే అత్యధిక ప్రాధాన్యము యివ్వబడింది. సామూహిక అభివృద్ధి కార్యకలాపాల ద్వారానూ జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాల ద్వారానూ గ్రామీణ ప్రాంతాల్లో సాధింపబడిన అభ్యుదయం సభ్యులకు సుపరిచితం. సామాజిక అభివృద్ధి కార్యకలాపాలకు మన ప్రణాళికలో ప్రముఖస్థానమున్నది. ఆయా అభివృద్ధి కార్యక్రమాల పద్దుల క్రింద తలపెట్టబడిన ఖర్చు అంచనాలు ఆరవ అనుబంధంలో చూపబడినవి.

**నీటి పారుదల**

14. 1955 వ సం॥ డిశంబరు 10 వ తేదీన మన ప్రధానమంత్రి నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. ఇది మనకూ హైదరాబాదు రాష్ట్రమునకూ ఉమ్మడి ప్రాజెక్టు. నందికొండవద్ద ఒక ఆనకట్ట, దానికిరువైపుల రెండు కాల్వలు, యీ ప్రాజెక్టుక్రింద నిర్మాణాలు. విశాలమైన ప్రాంతాలను యీ ప్రాజెక్టు సస్యశ్యామలం చేస్తుంది. ఈ ప్రాజెక్టు ఖర్చు రూ 122 కోట్లు అని అంచనా వేయబడింది. ఈ ప్రాజెక్టు పూర్తికాగానే 31.83 లక్షల యకరాల భూమి సాగులోకి వస్తుంది ; 75,000 కి. వా. విద్యుచ్ఛక్తి లభిస్తుంది. ఆనకట్ట నిర్మాణం, యింకా యితర పనులు ఒక బోర్డు యాజమాన్యంక్రింద జరుగుతున్నవి. ఈ బోర్డును కేంద్ర ప్రభుత్వం నియమించింది. మన ఉభయ రాష్ట్ర ప్రభుత్వాల ప్రతినిధులూ, కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులూ యీ బోర్డులో సభ్యులుగా ఉన్నారు. ఉభయ రాష్ట్రాలలోని కాల్వల నిర్మాణం ఆయా రాష్ట్ర ప్రభుత్వాల అజమాయిషీక్రింద ఉంది. ఈ సంవత్సరం ప్రాజెక్టు నిర్మాణం ఖర్చులక్రింద, మన ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వం రూ 60 లక్షల అప్పు మంజూరు చేసింది.

ఇంతకంటె తక్కువ స్థాయిగల మరికొన్ని నీటిపారుదల పథకాలు కూడా అమలు పరచబడుతున్నవి—తుంగభద్ర దిగువ కాలువ, కృష్ణా బ్యారేజి, ఎగువ పెన్నా ప్రాజెక్టు, రాళ్ళపాడు ప్రాజెక్టు, రొంపేరు మురుగు పథకం. ఇవిగాక కరువు ప్రాంతాల ప్రయోజనార్థం తలపెట్టిబడిన మరొక 17 నీటి పారుదల పథకాలు కూడా నిర్మాణంలో ఉన్నవి. ఈ పనులన్నీ సంతృప్తికరంగా సాగుతున్నవి. ఇందులో కొన్ని యీ ఏడు జూన్, సెప్టెంబరు ప్రాంతాల్లో పూర్తి కావచ్చు. ప్రణాళిక ప్రారంభకాలమునకు సాగులో ఉన్న 28.80 లక్షల ఎకరాల భూమి 30.65 లక్షల ఎకరాలకు పెరుగుతుందని అంచనా.

విద్యుచ్ఛక్తి ఈ సంవత్సరంలోగా పూర్తి కాజాలనట్టి నాగార్జున సాగర్ ప్రాజెక్టు, యింకా యితర నీటిపారుదల పథకాలకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు కేటాయించబడింది. అంతేకాక తుంగభద్ర ఎగువకాలువ, వంశధార ప్రాజెక్టు నిర్మాణాలకు, పులిచింతల, సిద్ధేశ్వరం ప్రాజెక్టుల పరిశీలనకు ద్వితీయ ప్రణాళికలో ఏర్పాట్లు చేయబడినవి. ద్వితీయ ప్రణాళిక పూర్తి అయ్యేసరికి అదనంగా 5.68 లక్షల ఎకరాల భూమి సాగు కావచ్చును.

15. రాష్ట్రంలో ప్రధానమైన విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు మాచ్‌ఖండ్, తుంగభద్ర: 1955 వ సం॥ ఆగస్టు 19 వ తేదీన రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేయటంతో మాచ్‌ఖండ్ ప్రాజెక్టు వినియోగం మొదలైంది. తుంగభద్ర జల విద్యుత్ప్రణాళిక 1956 డిశంబరు నుండి పని ప్రారంభించవచ్చు. నిర్మాణంలో ఉన్న యితర పథకాలు, నెల్లూరు, చిత్తూరు విద్యుత్ప్రణాళికలు. స్థానిక సంస్థల, వ్యక్తుల యాజమాన్యంలో నడుస్తున్న విద్యుచ్ఛక్తి వ్యవస్థలను స్వాధీనం చేసుకోవాలనే విధానానికి అనుగుణంగా, రాజమండ్రి, గుంటూరులలోని సంస్థలను, ఈస్ట్‌కోస్ట్ కంపెనీవారి సంస్థను, స్వాధీనం చేసుకొనటానికి ప్రభుత్వం ఆమోదించింది.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక మొదట్లో, విద్యుచ్ఛక్తి సప్లయి అవుతున్న గ్రామాలు, పట్టణాల సంఖ్య 170 మాత్రమే. ఈ నెలాఖరుకు యీ సంఖ్య 700 వరకు పెరుగుతుంది. 1950—51 లో విద్యుచ్ఛక్తి సగటు వ్యక్తి వినియోగం 5 యూనిట్లు. ఈ సంఖ్య కొద్ది కాలంలోనే 10 యూనిట్లకు పెరుగుతుంది.

ద్వితీయ ప్రణాళికాకాలంలో, మాచ్‌ఖండ్ వద్ద అదనంగా మరొక మూడు విద్యుత్పాదక యంత్రాలు నెలకొల్పబటడంతో, యీ ప్రాజెక్టు పూర్తి అవుతుంది. తుంగభద్ర జల విద్యుత్ప్రణాళిక క్రింద, ఆనకట్ట పవర్ హౌస్‌లో అదనంగా రెండు ఉత్పాదక యంత్రాలు, కాలువ పవర్ హౌస్‌లో మరొక యంత్రము, ఏర్పాటు చేయబడుతవి. తుంగభద్రనుండి చిత్తూరు ప్రాంతానికి విద్యుచ్ఛక్తిని కొనిపోవడానికి అవసరమైన నెల్లూరు-హంపీ విద్యుస్మార్గ నిర్మాణంతో సహా, నెల్లూరులో ఒక థర్మల్ స్టేషన్ నిర్మాణముకూడా జరుగుతుంది. ద్వితీయ ప్రణాళిక పూర్తి అయ్యేసరికి షుమారు 1,600 గ్రామ, పట్టణాలకు విద్యుచ్ఛక్తి సప్లయి జరుగుతుందనీ, సగటు వ్యక్తి వినియోగం 10 యూనిట్లనుండి 20 యూనిట్లకు పెరుగుతుందని భావిస్తున్నాం.

రహదార్లు. 16. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రారంభంనాటికి రాష్ట్రంతో మొత్తం 14,794 మైళ్ళ పొడవుగల రోడ్లు ఉన్నై. ప్రస్తుతపు ప్రణాళికాకాలంలో జరిగే

అదనపు నిర్మాణాలతో సహా మొత్తం 15,430 మైళ్ల రోడ్లు ఏర్పడుతవి. ఇందులో 900 మైళ్ళు జాతీయ రహదార్ల క్రిందకి వస్తై (కేంద్ర ప్రభుత్వ ధనంతో నిర్మింపబడి, సంరక్షింపబడుతున్నవి), మిగిలినవాటిలో 5,808 మైళ్ళు రాష్ట్రప్రభుత్వాధీనం క్రింద, 8,722 మైళ్ళు స్థానిక సంస్థల క్రింద ఉన్నవి. రాష్ట్రప్రభుత్వ యాజమాన్యం లోగల 5.808 మైళ్ల పొడవుగల రోడ్లలోనూ, 1,365 మైళ్ళు రాష్ట్రీయ రహదార్లుగానూ, 4,429 మైళ్ళు ప్రధాన జిల్లామార్గాలుగానూ, 14 మైళ్ళు యితర జిల్లా మార్గాలుగానూ వ్యవహరింప బడుతున్నవి. ప్రధాన జిల్లా మార్గాలుగా వ్యవహరింపబడుతున్న వాటిలో 2,300 మైళ్ళు జిల్లాబోర్డుల ఆధీనంలో ఉన్నవి. జిల్లా బోర్డులనుండి వీటిని ప్రభుత్వం యాజమాన్యంలోకి క్రమంగా తీసుకోవడమే ప్రభుత్వ విధానం.

క్షామనివారణ కార్యకలాపాల క్రింద నిర్మించబడిన 60 మైళ్ళ రోడ్లతోసహా షుమారు 1,600 మైళ్ల రోడ్లను ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో స్థానిక సంస్థల యాజమాన్యంనుండి స్వాధీనం చేసుకోవాలని సంకల్పం. ప్రధాన మార్గాలతో గ్రామాలను కలుపుతూ 110 మైళ్ళ పొడవు రోడ్లు నిర్మించుటకూ, 800 మైళ్ళ పొడవువరకు, ఉన్న రోడ్లను బాగుపరచుటకుకూడా ఉద్దేశించబడింది. "ఇతర రోడ్ల" క్రింద 150 వంతెనలు, తూములు నిర్మించడానికి అవకాశం కల్పించబడింది. జిల్లా ప్రధాన కార్యాలయాలతోనూ, ముఖ్యవ్యాపార కేంద్రాలతోనూ కొన్ని బాగా ముఖ్యమైన గ్రామాలకు రాకపోకల సౌకర్యాలు కల్పించడమే యీ కార్యక్రమ లక్ష్యం.

విద్య, ప్రాథమిక విద్య.

17 ప్రాథమిక, ఉన్నత పాఠశాల కార్యక్రమాలలో అభివృద్ధి సాధించే ఉద్దేశంతో యీ సంవత్సరంలో ప్రాథమిక, ఉన్నత విద్యా విధానాలలో కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. మున్ముందు ప్రాథమిక పాఠశాలల్లో విద్యాబోధనకు సెకండరీ గ్రేడ్ ట్రైనింగు అయిన ఉపాధ్యాయులు మాత్రమే నియమించబడతారు. ఈనిర్ణయానికి అనుగుణంగా, యీసంవత్సరంలో, ట్రైనింగు పాఠశాలల్లోని ఎలిమెంటరీగ్రేడ్ సెక్షన్లలో సగంవరకు సెకండరీ సెక్షన్ల క్రిందికి మార్పుచేయబడినవి. వచ్చే రెండు, మూడు సంవత్సరాల కాలంలో, మిగిలిన ఎలిమెంటరీ సెక్షన్లుకూడా సెకండరీ గ్రేడ్ సెక్షన్లుగా మార్పు చేయబడుతవి. ట్రైనింగు సెక్షన్లలో ప్రవేశానికి ఉన్నత విద్యార్హతలు నిర్ణయింపబడినవి; ట్రైనింగు కాలపరిమితి రెండేళ్ళనుండి ఒక ఏడాదికి తగ్గించబడింది. ప్రారంభ దశలో 1956–57 లో యీ ఒక సంవత్సరంకోర్సు ఎనిమిది ప్రభుత్వ సంస్థల్లో ప్రవేశ పెట్టబడుతుంది. ఇంటర్మీడియేట్ పరీక్షలో ఉత్తీర్ణులైనవారికి, లేదా ఇంటర్మీడియేట్ పూర్తిచేసినవారికి, ఎస్.ఎస్.ఎల్.సీ. పరీక్షలో అన్నింటిలోనూ ఎక్కువ మార్కులు వచ్చినవారికి, యిలాంటి ఉన్నత విద్యా యోగ్యతలు కలవారికి– యీ క్రొత్త ట్రైనింగు కోర్సులో చేరటానికి ప్రాధాన్యము చూపబడుతుంది. ఉన్నతపాఠశాలా విద్యార్థుల విద్యాస్థాయిని పెంచడానికై ప్రభుత్వం పూనుకొన్న మరొక కార్యక్రమం, చిన్న తరగతులలోకి విద్యార్థులను చేర్చుకొనడంలో కొన్ని నిర్బంధాలు ఏర్పరచడం. ప్రైవేటుగా చదివిన విద్యార్థులు 1956-57 నుండి రెండవఫారంకంటే పెద్దక్లాసులోనూ, 1957-58 నుండి ఒకటవ ఫారంకంటే పెద్దక్లాసులోనూ చేర్చుకోబడరు. అంతేకాక, ఒకటవఫారంలో

చేరదలచుకున్న విద్యార్థికి, చేరుతున్న సంవత్సరం ఆగస్టు 15 వ తేదీకి 10 సంవత్సరాల వయస్సు పూర్తి అయి ఉండాలనికూడా నిబంధన ఏర్పరచబడింది.

ఈ సంవత్సరంనుండి ఎలిమెంటరీ గ్రేడ్ ట్రైనింగు శిక్షణ పొందుతున్న విద్యార్థులలో సగంమందికి మాత్రమే స్టయిఫెండులు యివ్వాలని ప్రభుత్వం, ఖర్చును తగ్గించుకొనే దృష్టితో నిశ్చయించింది. సెకండరీగ్రేడ్ ట్రైనింగు విద్యార్థులలో షెడ్యూల్డు తరగతులు, జాతులు, వెనుకబడిన వర్గాలకు చెందినవారికీ, విద్యార్థినులకూ మాత్రమే స్టయిఫెండ్లు యివ్వబడుతవి. ఎనిమిది ప్రభుత్వ పాఠశాలల్లో క్రొత్తగా ప్రవేశపెట్టబడిన ఒక సంవత్సరంకోర్సు చదువుతున్న విద్యార్థులకుమాత్రం మామూలు స్టయిఫెండ్లు యివ్వబడుతై.

ఉన్నత విద్య. ఉన్నత విద్యావిధాన పునర్నిర్మాణ సంఘంవారు చేసిన ప్రధానమైన సిఫార్సులలో కొన్నిటిని ప్రభుత్వం అమలుపరచింది; అవేవంటే, ఉన్నత పాఠశాలల్లో శాస్త్రీయ విజ్ఞాన బోధనావకాశాలను అభివృద్ధిచేయడం, పాఠశాలల గ్రంథాలయాల అభివృద్ధి, సకలార్థ సాధక పాఠశాలల స్థాపన, మాధ్యమిక పాఠశాలలలో వృత్తి విద్యాబోధన, వృత్తివిద్యా బోధకులకు శిక్షణ కేంద్రాలు, పునశ్చరణ తరగతులు, ఈపథకాలనిమిత్తం ఈయేడు బడ్జెట్‌లో రు 75.48 లక్షలు కేటాయించబడింది. ఈ సందర్భంలో ఒకేసారి ఖర్చులకు, నిత్యఖర్చులకు కేంద్ర ప్రభుత్వం సహాయక గ్రాంట్లుకూడా మంజూరు చేసింది.

హిందీ-సంస్కృతం. సంస్కృత బోధనాభివృద్ధి నిమిత్తం, ప్రత్యేక యోగ్యతలుగల పండితులకు ప్రభుత్వం అడ్వాన్సు యింక్రిమెంట్లు మంజూరు చేయడానికి ఉత్తరువులు జారీచేసింది. అలాగే సంస్కృతంలో అర్హతనుపొందు తెలుగు పండితులకుకూడా అడ్వాన్సు యింక్రిమెంట్లు యివ్వబడుతవి. ప్రాచ్య విద్యాసంస్థలలో విద్యార్థులు చేరడానికి ప్రోత్సాహంయిచ్చే ఉద్దేశంతో, ఆయా విద్యార్థుల తల్లిదండ్రుల సంవత్సరాదాయం రూ 1,800 లకు మించని సందర్భాలలో 6 వ ఫారంవరకు ప్రాచ్య విద్యాలయాల్లో జీతంలేకుండా చదువు చెప్పటానికి ప్రభుత్వం అనుమతించింది.

ఈ సంవత్సరంనుండి, ఒకటో ఫారం నుండి నాలుగో ఫారం వరకు మూడవ భాషగా హిందీ నిర్బంధవిషయం చేయబడింది. తరువాత సంవత్సరాల్లో ఐదు, ఆరు ఫారాలలోకూడా హిందీ చదవాలి. విశారద విద్యాలయాలు ప్రారంభించడం హిందీ ప్రేమీమండలులకు గ్రాంట్లు యివ్వడం వగైరా చర్యలద్వారా హిందీ భాషను ప్రచారం చేయడానికి ప్రభుత్వం పూనుకుంది. దీనికోసం అయ్యే ఖర్చును కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం హిందీ ప్రచారసభ పంచుకుంటై.

ప్రథమ పంచవర్ష ప్రణాళికకాలంలో క్రొత్తగా 751 ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటుచేయబడినవి. ఇప్పుడు రాష్ట్రం మొత్తంమీద 18,000 ప్రాథమిక పాఠశాలలు ఉన్నవి. రాష్ట్రంలో 600 ఉన్నత పాఠశాలలు ఉన్నవి. వీటిలో 15 సకలార్థసాధక ఉన్నత పాఠశాలలు. ప్రస్తుతం రాష్ట్రంలో ట్రైనింగు పాఠశాలల సంఖ్య 78 (56 మామూలు 22 బేసిక్). ఈసంవత్సరం విశాఖపట్నంలో క్రొత్తగా ఇంజనీరింగు కళాశాల ప్రారంభించడానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి ప్రభుత్వం అనుమతి యిచ్చింది. అనంతపురంలోనూ, కాకినాడలోను రెండున్నర సంవత్సరాల సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజ

నీరింగు డిప్లొమా కోర్సును ప్రారంభించడానికి కూడా అనుమతించింది. గౌరవనీయ సభ్యులకు యీ విషయాలు గుర్తు ఉండే ఉంటాయి.

పాఠశాలల్లో చదివే విద్యార్థుల సంఖ్యలో, 6-11 సం॥ మధ్య వయసు వారిలో 15%, 11—14, సం, 14—17 సం, మధ్యవయసు వారిలో 20% అభివృద్ధిని సాధించాలని ద్వితీయ ప్రణాళిక లక్ష్యం. క్రొత్తపాఠశాలలను ప్రారంభించడానికి 1,000 ప్రాథమిక, 60 మాధ్యమిక, 25 ఉన్నత పాఠశాలలు ప్రణాళికలో అవకాశం కల్పించబడింది 15 ఉన్నత పాఠశాలలను సకలార్థసాధక పాఠశాలలుగానూ, మరొక 30 ఉన్నత పాఠశాలలను అధికోన్నత (హైయ్యర్ సెకండరీ) పాఠశాలలుగాను మార్చాలని ఉద్దేశ్యము.

18. రాష్ట్రంలో వైద్య సౌకర్యాలు చాలా తక్కువగా ఉన్నవి. ఇతర సాంఘిక సేవాకార్యకలాపాలలాగానే వైద్య సౌకర్యాల అభివృద్ధి కూడా ప్రస్తుతం మన తాహతుకు మించిన మొత్తాల ఖర్చుతో కూడుకుని ఉంది. అయినప్పటికి, రాష్ట్రంలో వైద్యసౌకర్యాల అభివృద్ధినిమిత్తం ప్రణాళికలో కొంత అవకాశం కల్పించబడింది. కర్నూలు జనరల్ ఆసుపత్రికి రు. 17.10 లక్షల అంచనా ఖర్చుతో అదనపు భవనాల నిర్మాణం మంజూరు చేయబడింది. కడప హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో మంచాల సంఖ్య 104 నుండి 140 వరకు పెంచబడింది. విశాఖపట్నం కింగ్ జార్జి ఆస్పత్రిలోను, ఏలూరు హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలోను అదనపు భవనాల నిర్మాణం పూర్తికావచ్చింది. కొద్దికాలంలోనే వాటిని ఉపయోగించుకోవచ్చు. రాష్ట్రంలో ప్రత్యేకంగా ఒక కెమికల్ ఎక్జామినర్ శాఖ, ఒక ప్రాంతీయ శాస్త్రపరిశోధనాగారం మంజూరు చేయబడినవి. కర్నూల్లో ఒక వైద్యకళాశాలను ప్రారంభించాలని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది; ఇందుకై అనుమతికొరకు, ఆర్థిక సహాయం కొరకు కేంద్రప్రభుత్వాన్ని అర్థించడంకూడా జరిగింది. వైద్య సౌకర్యము,—ప్రజారోగ్యం—

రాష్ట్రంలో ప్రస్తుతం 6 బి. సి. జి. టీకాల దళాలు పనిచేస్తున్నవి. మూడు దళాలు రాయలసీమ ప్రాంతంలోనూ, మిగిలినవి విశాఖపట్నం తూర్పుగోదావరి జిల్లాలలోనూ పనిచేస్తున్నవి. తిరుపతిలోను, రామచంద్రపురంలోనూ రెండు కుష్టురోగ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడి ఉన్నాయి. ఇవి కేంద్ర ప్రభుత్వ సహాయంతో ఏర్పడినవి. మలేరియా నివారణకై రెండు యూనిట్లు పనిచేస్తున్నవి. మరొక నాలుగు యూనిట్లు—రెండు ఏజెన్సీప్రాంతాలలోను, రెండు యితర చోట్లను— ఏర్పరచే ప్రతిపాదనను ప్రభుత్వం పరిశీలిస్తున్నది. కేంద్రప్రభుత్వం తలపెట్టిన బోదకాలు వ్యాధినివారణ ప్రణాళికక్రింద ప్రభుత్వం రెండు సర్వే యూనిట్లను, ఒక కంట్రోలు యూనిటును ఏర్పాటుచేసింది. పిటికార్యాలయం తూర్పుగోదావరి జిల్లాలో ఉన్నది. క్షయవ్యాధికి ఒక ప్రభుత్వ శానిటోరియం ఉంది. క్షయవ్యాధి నివారణకై మరికొన్ని ఆస్పత్రులు, విశ్రాంతి పురములు స్థాపించి చికిత్స సౌకర్యాలను అభివృద్ధిచేయాలని ఆశిస్తున్నాం. కుష్టువ్యాధి నిర్మూలనకుగూడా సౌకర్యాలు ఎక్కువ చేయదలచాం. 100 మంచాలతో ఒక పిచ్చి ఆస్పత్రినీ, రెండు అంటువ్యాధుల ఆస్పత్రులనుకూడా ఏర్పరచాలనే ప్రతిపాదన ఆలోచనలో ఉంది. అది ఎక్కడ ఏర్పరచవలెనో ఇంకా తేలలేదు. అంతేకాక, 55 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను, 10 కుటుంబ నియంత్రణ కేంద్రాలను తెర్వాలనే ఆలోచనకూడా ఉంది.

**నీటి సప్లయి మురుగు పారుదల ప్రణాళిక.**

19. మునిసిపాలిటీలలోనూ, పట్టణ పంచాయితీల్లోనూ ఇప్పుడు అమలు జరుపబడుతున్న 9 నీటి సప్లయి స్కీముల అభివృద్ధి మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభింపబడినది. క్రొత్తగా 8 నీటి సప్లయి స్కీములు, 2 మునిసిపల్ మురుగు నీటి ప్రణాళికలు కూడా ప్రారంభింపబడినవి. ఈ 17 నీటి సప్లయి పథకాల్లోనూ, యీ సంవత్సరాంతానికి 3 పూర్తిఅవుతై. మిగిలిన 14 పథకాలు ద్వితీయ ప్రణాళికాకాలంలో కొనసాగింప బడతాయి. పని పూర్తికాని నీటి సప్లయి పథకాలలో అత్యంత ప్రధానమయినది విశాఖపట్నం వద్ద గోస్తనీ స్కీము; దీని ఖర్చు అంచనా రూ 116 లక్షలు. ఇది విశాఖపట్నం మునిసిపాలిటీ, రైల్వే, రేవు, దేశరక్షణ వ్యవస్థలకు నీటి సప్లయి నిమిత్తం ఉద్దేశింపబడింది. దేశ రక్షణ శాఖ, రైల్వే శాఖలుకూడా దీని నిర్మాణ ఖర్చులను భరించ గలవని భావించబడు తున్నది. 1956వ సంవత్సరానికి యీ స్కీము పూర్తికావచ్చు; 1957 జనవరి ఒకటవ తేదీనుండి కాల్టెక్సు నూనె కర్మాగారానికి నీటి సప్లయి లభించవచ్చు.

ప్రథమ పంచవర్షప్రణాళికలో చేర్చబడిన మూడు మురుగు నీటి పథకాలలో, విశాఖపట్నం ప్రణాళిక పూర్తిఅయింది. ఈ సంవత్సరము మరొక (విజయవాడ) స్కీమును ఆరంభింపవలెనని ఉన్నది.

**గ్రామీణ ప్రాంతాలకు నీటి సప్లయి.**

20. గ్రామీణ ప్రాంతాలకు, కేంద్రప్రభుత్వపు జాతీయ నీటిసప్లయి, పారిశుద్ధ్య ప్రణాళికను నాలుగు ప్రాంతాల్లో రూ 80 లక్షల ఖర్చుతో అమలు పరచాలని నిశ్చయింప బడింది. ఈ ప్రణాళిక ఖర్చులో సగం కేంద్ర ప్రభుత్వమునుండి గ్రాంట్లు రూపంలో లభిస్తుంది. ఈ సంవత్సరములో ఈ ప్రణాళిక క్రింద రూ 50 లక్షలు వ్యయం చేయాలని మొదట్లో ఉద్దేశించబడింది; కాని కొన్ని యిబ్బందుల మూలంగా యీ మొత్తంలో సగానికి పైగానే కాలదోషం పట్టింది. రాబోయే సంవత్సరము బడ్జెట్‌లో దీనికి అవసరమైన ఏర్పాటు చేయబడింది.

**షెడ్యూల్డు జాతుల ఉద్ధరణ.**

21. ఆంధ్రరాష్ట్ర షెడ్యూలుజాతుల ఆర్థిక, అభివృద్ధి కార్పొరేషన్ (లిమిటెడ్) ను నిర్మించే పథకాన్ని ప్రభుత్వం యిటీవలనే మంజూరు చేసింది. ఈ సంస్థ ప్రధానోద్దేశాలు—షెడ్యూల్డుజాతి సభ్యులకు పరపతి సౌకర్యాలు కల్పించడం, వారి వ్యవసాయ పంటలు, యితర పంటలకు అమ్మకపు సౌకర్యాలు ఏర్పరచడం, వ్యవసాయం నిమిత్తమైనవారి అవసరాలను తీర్చడం, వారిలో పొదుపుతనం, పరస్పర సహకారం వగైరా సద్గుణాలను ప్రోత్సహించడం. ప్రస్తుతానికి యీ సంస్థక్రింద రెండు డిపోలు—ఒకటివిశాఖజిల్లా నరసీపట్నం లోను, రెండోది శ్రీకాకుళం జిల్లా కురుపంలోను ఉంటాయి. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో ఆరు కేంద్రాలలో చిన్న డిపోలు ఏర్పాటుచేయబడతాయి. యీ సంస్థకు సంబంధించిన ప్రాథమిక నిర్మాణ చర్యలను పూర్తిచేసి, దానిని 1930 సంవత్సరపు ఇండియా కంపెనీల చట్టంక్రింద రిజిష్టరు చేయించటానికై ఒక స్పెషల్ ఆఫీసరు నియమించబడ్డాడు. ఈ సంస్థకు కావలసిన వాహనాలను కొనడానికి, గిడ్డంగుల నిర్మాణానికిగాను కేంద్రప్రభుత్వం మూడులక్షలరూపాయల గ్రాంటును మంజూరుచేసింది.

షెడ్యూల్డు కులాలు, వెనుకబడిన వర్గాలవారికి సంబంధించిన విషయాలు కాక, అదనంగా షెడ్యూలు జాతుల పనులుకూడా ప్రస్తుతం సాంఘిక సంక్షేమ శాఖా డైరెక్టరే చూస్తున్నాడు. ఆయనకు షెడ్యూలు జాతుల సంక్షేమ కార్యక్రమంమీద కేంద్రీకరించి పనిచేయగల అవకాశం లేనందున, కాకినాడ ప్రధానకార్య

స్థానంగా ప్రత్యేకంగా ఒక కొండజాతుల సంక్షేమ శాఖాడైరెక్టరును నియమించాలని నిర్ణయించబడింది. అరకులోను, భద్రాచలంలోను ఇద్దరు డిప్యూటీ డైరక్టర్లు ఆయనకు తోడ్పడుతారు.

రోడ్ల నిర్మాణం ద్వారానూ, నీటి పారుదల సౌకర్యాలు, మంచినీటి సప్లయి కల్పించడం ద్వారాను, మెట్ట్యాలు ప్రాంతాల అభివృద్ధి సాధించాలని ద్వితీయ ప్రణాళిక సంకల్పించింది. మలేరియా నివారణ చర్యలు విస్తరించ బడుతవి. ఇంకా ఎక్కువ పాఠశాలలు, వైద్యసౌకర్యాలు కల్పించబడతాయి. ఇందులో కొన్ని స్కీములకు కేంద్రంనుండి గ్రాంట్లుకూడా లభిస్తవి.

22. వెనుకబడ్డ కులాల సముద్ధరణకై ప్రభుత్వం ప్రస్తుతం తీసుకుంటున్న వివిధ కార్యక్రమాల వివరాలు గౌరవనీయ సభ్యులందరికీ తెలుసు. మెడ్యూల్డు కులాలు, వెనుకబడినవర్గాలు,

ఈ కార్యక్రమాల నిమిత్తం వచ్చే సంవత్సరము బడ్జెట్‌లో రూ 51.20 లక్షలు కేటాయించబడింది. ఇందులో విద్యాలయాల్లో చదువుతున్న విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు, స్టయిఫెండ్లు యిచ్చేనిమిత్తం కేటాయించిన రు 9.49 లక్షలు కూడా కలిసింది. ద్వితీయ ప్రణాళికా కాలంలోగూడా యీ చర్యలన్నీ కొనసాగింపబడతాయి; ఇంకా క్రొత్తస్కీములు—గృహ నిర్మాణం, కుటీర పరిశ్రమలు, సంక్షేమ పాఠశాలల్లో వెనుకబడిన వర్గాల విద్యార్థులకు మధ్యాహ్న భోజన వసతి కల్పన—కూడా అమలు జరుపబడతాయి.

23. రాష్ట్రంలో ఆహారధాన్యాల ఉత్పత్తి 1950–51 లో 40.69 లక్షల టన్నులనుండి 1955–56 లో 44.60 లక్షల టన్నులకు పెరిగింది. ఇప్పుడు మనం ఇతర రాష్ట్రాలకు ఆహారధాన్యాలు సప్లయిచేసే స్థితిలోకి వచ్చాం; విదేశాలకు కూడా మేలురకము బియ్యం ఎగుమతి చేయగలం.

విత్తుల ఉత్పత్తి, పంపకం; ట్రాక్టర్లు, ఆయిల్ ఇంజన్లు ఎలక్ట్రిక్ మోటార్ల కిరాయి—కొనుగోలు పద్ధతిమీద కొనుగోలుచే, పంచడం, వగైరా స్కీములు, యింకా భారీయెత్తున కొనసాగించబడతాయి. హోలుగుండి, బాపట్లలోని ట్రాక్టర్ నిర్మాణశాలలు అభివృద్ధి చేయబడతాయి. ఐ. సి. ఎ. ఆర్. సహకారంతో పండ్లకు, కూరగాయలకు క్రొత్తగా పరిశోధనశాలలు నెలకొల్పాలనే ఆలోచన ఉంది. ద్వితీయ ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి చెఱకు పంటలో 9.85 లక్షల టన్నులు, నూనెవిత్తుల ఉత్పత్తిలో 1.73 లక్షల టన్నులు, ప్రత్తిపంటలో 2,000 బేళ్లు అధికోత్పత్తి చేకూరవచ్చు. ద్వితీయ ప్రణాళికాకాలంలో భూసంరక్షణ ద్వారా క్రొత్తగా 86,000 ఎకరాలు భూమి బాగుచేయబడి సాగులోకి వస్తుందని అనుకుంటున్నాం.

తాత్కాలికపు ఏర్పాటుగా, బాపట్ల వ్యవసాయ కళాశాల భవనాల్లో 1955 వ సం॥ జూలైలో ఒక పశువైద్య కళాశాల స్థాపించబడి, మొదటి సంవత్సరం కోర్సు ప్రారంభించబడింది. ఉచితమైనచోట స్థిరంగా యీ కళాశాలను నెలకొల్పాలనే ప్రతిపాదన పరిశీలనలో ఉంది. కేంద్రప్రభుత్వం ప్రారంభించిన "రిండర్ పెస్ట్" నిర్మూలనోద్యమం కృష్ణానదికి దక్షిణాన ఆరు జిల్లాలలో ఇప్పుడు అమలు జరుపబడుతున్నది. 1956–57 వ సంవత్సరంలోకూడా యీ ఆరు జిల్లాల్లో యీ ఉద్యమాన్ని కొనసాగించడానికీ, కృష్ణానదికి ఉత్తర ప్రాంతంలోని

యితర జిల్లాలకుకూడా ఈ ఉద్యమాన్ని వ్యాపింపజేసి రాష్ట్రం మొత్తంమీద పశువుల సంరక్షణకై పాటుపడటానికి అవకాశం కల్పించబడింది.

సహకారం.-- గృహ నిర్మాణం.

24. ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలంలో గృహనిర్మాణాల నిమిత్తం గృహనిర్మాణ సహకార సంఘాలద్వారా అప్పులు యివ్వబడినవి. పట్టణ ప్రాంతాల్లో 1,319 యిండ్లు, గ్రామీణ ప్రాంతాల్లో 125 యిండ్లు కట్టబడినవి. ఇవిగాక పట్టణప్రాంతాల్లో 637 యిండ్లు, గ్రామాల్లో 52 యిండ్లు నిర్మాణంలో ఉన్నై. శిక్షణ సంస్థల నిర్వహణ, గిడ్డంగుల నిర్మాణానికై అప్పులు మంజూరు చేయడం, పాల సప్లయి సంఘాలలాంటి ప్రత్యేక సహకార సంఘాల పర్యవేక్షణ వగైరా కార్యకలాపాలుకూడా కొనసాగించబడినవి.

అఖిల భారత గ్రామీణ పరపతి సౌకర్య పరిశీలనా సంఘంవారు చేసిన సిఫార్సులు గౌరవనీయ సభ్యులకు తెలిసే ఉంటవి. ద్వితీయ ప్రణాళికాకాలంలో సహకార రంగంలో మన ప్రధాన కర్తవ్యం, ఆ సిఫార్సులను అమలుపరచడమే. రిజర్వు బ్యాంకు, కేంద్ర ప్రభుత్వం వద్దనుండి ఆర్థిక సహాయం విషయమై తగిన హామీలు లభించగానే, కర్నూలు, పశ్చిమ గోదావరి, విశాఖపట్నం జిల్లాల్లో ఎన్నుకున్న కొన్ని ప్రదేశాల్లో మొదట్లో ఒక పైలట్ స్కీము అమలుపరచాలని ఉద్దేశం ఉంది. ఈ పైలట్ స్కీములోని ప్రధాన అంశాలేవంటే—

1. పెద్ద పెద్ద పరపతి సంఘాలు, కేంద్ర సహకార బ్యాంకులు, సహకార మార్కెటింగ్ సొసైటీలు వగైరా సంస్థల మూలధనంలో కొంత భాగాన్ని సమకూర్చడం. 2. పెద్ద పెద్ద పరపతి సంఘాలు, సహకార మార్కెటింగ్ సొసైటీలు నియమించుకొనే పర్యవేక్షక సిబ్బంది ఖర్చులను సబ్సిడీరూపంలో భరించడం. 3. మార్కెటింగ్ సొసైటీలకు గిడ్డంగుల నిర్మాణం, అవసర యంత్రాల స్థాపన వగైరా కార్యకలాపాలకై అప్పులు, సబ్సిడీలు యివ్వడం.

ఇంతకుముందు చెప్పబడిన సిఫార్సుల ననుసరించి, ఒక జాతీయ సహకార అభివృద్ధి సంస్థ, కేంద్ర వేర్ హౌసింగ్ సంస్థ, రాష్ట్రీయ వేర్ హౌసింగ్ సంస్థల నిర్మాణానికి అనువుగా కేంద్రప్రభుత్వం త్వరలోనే శాసనాలు చేయబోతున్నది. ఈ సంస్థల ప్రధాన కర్తవ్యం, సహకార మార్కెటింగ్ వ్యవస్థను బలిష్టం చేయడం, గిడ్డంగులు, వేర్ హౌసులద్వారా తగినన్ని నిల్వ సౌకర్యాలు కల్పించడం. కేంద్ర ప్రభుత్వం శాసనంచేసి, అవసరమైన ఆర్థిక సహాయాన్ని యివ్వగానే, 1956-57 లో యీ రాష్ట్రంలో ఒక వేర్ హౌసింగ్ సంస్థను నెలకొల్పాలని ఉద్దేశిస్తున్నాము. ఇందుకు చిహ్నంగా ఒక చిన్న మొత్తం బడ్జెట్‌లో కేటాయించబడిందికూడా.

పరిశ్రమలు— చేనేత

25. ఆమోదింపబడిన రెండు కోట్ల రూపాయల మూలధనంతో ఒక స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ స్థాపించబడింది. జారీ చేయబడిన మూలధనం, రు 50 లక్షలు ఇందులో రు. 20 లక్షలు రాష్ట్రప్రభుత్వం, రు. 10 లక్షలు రిజర్వు బ్యాంకు నుండి లభించింది. రాష్ట్రంలోని భారీ పరిశ్రమలు, మధ్య తరహా, చిన్న పరిశ్రమలకు యీ కార్పొరేషన్‌ద్వారా ఆర్థిక సహకారం చాలావరకు లభించగలదు. ఈ సంవత్సరం, చిన్న పరిశ్రమలకు చెందిన 18 ప్రణాళికలు మంజూరు చేయబడినవి. వీటన్నిటికీ మొత్తం రు. 14.80 లక్షలు ఒకేసారి ఖర్చు, రు. 10.90 లక్షలు నిత్య ఖర్చు అవుతుంది. రు. 4.13 లక్షలు గ్రాంట్లు రూపంలోను, రు 9.66 లక్షలు అప్పు రూపంలోను, కేంద్రంనుండి సహాయం లభించింది. ఈ సంవత్సరంలో,

ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీకి అదనపు భవనాల నిర్మాణానికీ, ఎలెక్ట్రికల్ పోర్సిలెయిన్ ఇన్సులేటర్ల ఉత్పత్తికిసంబంధించిన ఒక స్కీమును ప్రభుత్వం ఆమోదించింది. ఫ్యాక్టరీలో 18 అంగుళాల నీటి గొట్టాలు తయారీచేస్తున్న ఉత్పత్తి కొనసాగించడానికి ఏర్పాట్లు జరిగాయి.

పోతే ప్రైవేటు రంగంలో, తాడిపత్రిలోని ప్రత్తి ఉత్పత్తిదారుల సహకార నూలు మిల్లుతోసహా, నాలుగు మిల్లులకూ, రెండు పంచదార ఫ్యాక్టరీలకూ, మూడు సిమెంటు ఫ్యాక్టరీలకూ, ఒక ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీకి, సూపర్ ఫాస్ఫేట్, ఇతర ఎరువుల ఫ్యాక్టరీకి, కేంద్ర ప్రభుత్వం లైసెన్సులు మంజూరుచేసింది. ప్రస్తుతం ఉన్న సిమెంటు, పంచదార ఫ్యాక్టరీల విస్తరణ కార్యక్రమాన్నికూడా కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో రాజమండ్రిలోని ఆంధ్ర పేపరు మిల్లును వృద్ధిచేయాలని సంకల్పించబడింది. ఇంకా మేలురకం కాగితం ఉత్పత్తి చేయాలనీ, ఉత్పత్తి రోజుకు 10 నుండి 35 టన్నులకు పెంచాలనీ ఆలోచిస్తున్నాం. భవన నిర్మాణం సామాగ్రి వగైరా ఖర్చులక్రింద యీ విస్తరణ ప్రణాళికకు రు. 20 లక్షలు ఖర్చు అవుతుంది. సహకార పద్ధతులమీద, ప్రభుత్వంకూడా భాగస్వామిగా, యిండస్ట్రియల్ ఫైనాన్షియల్ కార్పొరేషన్‌వారివద్ద తీసుకునే ఋణంతో, 6 పంచదార ఫ్యాక్టరీలను స్థాపించాలని ప్రభుత్వము ఉద్దేశించింది. ఈ ప్రతిపాదనలు కేంద్రప్రభుత్వ పరిశీలనలో ఉన్నవి. ఈ స్కీముక్రింద చిహ్నంగా, ఒక చిన్న మొత్తం బడ్జెట్‌లో కేటాయించబడింది.

పోతే చేనేత పరిశ్రమ విషయంలో, గత రెండు సంవత్సరాల్లోనూ సెస్ ఫండ్ స్కీము అమలుపరచినందున సంతృప్తికరమైన సత్ఫలితాలు కలిగాయి. చేనేత సహకారసంఘాల నెలసరి సగటు అమ్మకం 1954-55 లో రు. 11.02 లక్షల నుండి 1955-56 లో రు. 17.19 లక్షలకు పెరిగింది.

కమ్యూనిటీ ప్రాజెక్టులు: జాతీయ విస్తరణ సేవా ప్రణాళికలు:

26. రాష్ట్రంలో రెండు కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజెక్టులు ఉన్నవి; ఒకటి కాకినాడ-పెద్దాపురం ప్రాంతంలోనూ, రెండోది కడప-కర్నూలు కాలువ ప్రదేశంలోనూ, ఇవి 1952 అక్టోబరులో ప్రారంభించబడినవి. మొదట్లో యీ ప్రాంతాల కార్యకలాపాలకు నిర్ణయింపబడిన మూడు సంవత్సరాల కాలపరిమితి యిప్పుడు మరొక ఏడాదికి పొడిగించబడింది. అందువల్ల ఇవి 1956 సెప్టెంబరు వరకు కార్యక్రమం నడుపుతూనే ఉంటై. ఇవిగాక 1954 అక్టోబరులో రెండు కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులు, 27 జాతీయ విస్తరణ సర్వీసు బ్లాకులు ప్రారంభింపబడినవి. ఈ 27 బ్లాకులలో 11 బ్లాకులు 1955 ఏప్రిల్ ఒకటో తేదీనుండి కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులుగా మార్చబడినవి. గత సెప్టెంబరు నెల చివరకు రాష్ట్రంలో రెండు కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజెక్టులు, 13 కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులు, 16 జాతీయ విస్తరణ సర్వీసు బ్లాకులు ఉన్నవి. ఇవన్నీ 9,626 చ. మైళ్ల మేర వ్యాపించి, 2,567 గ్రామాలకు చెందిన 37.5 లక్షల జనాభాకు సంబంధించిన అభివృద్ధి కార్యకలాపాలను నిర్వహిస్తున్నవి. రెండు కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజెక్టులమీద మొత్తం ఖర్చు రు. 68.98 లక్షలు. ఇందులో ప్రజలనుండి ఐచ్ఛికంగా ధనరూపంలోను, సామాగ్రి రూపంలోను, శ్రమరూపంలోను రు. 38.85 లక్షలవరకు లభించింది. జాతీయ విస్తరణ సర్వీసు బ్లాకుల ఖర్చుల్లోకూడా ప్రజలనుండి లభించిన ధనం చాలా ప్రోత్సాహకరంగా ఉంది. ఇప్పు

టికే అమల్లోవున్న యీ బ్లాకులే గాక యింకా 20 జాతీయ విస్తరణ సర్వీసు బ్లాకులలో కార్యక్రమం త్వరలోనే ప్రారంభమవుతుంది. 1956 ఏప్రిల్ ఒకటో తేదీ నుండి మరొక 11 నేషనల్ ఎక్స్‌టెన్‌షన్ సర్వీసు బ్లాకులు, కమ్యూనిటీ డెవలప్‌మెంటుబ్లాకులుగా మార్చబడతై. ద్వితీయ ప్రణాళిక పూర్తి అయ్యేసరికి యీ అభివృద్ధి కార్యక్రమము రాష్ట్రమంతటికీ వ్యాపిస్తుంది. ప్రస్తుత కార్యక్రమాన్నిబట్టి 1956-57 లో మరొక 50 నేషనల్ ఎక్స్‌టెన్‌షన్ సర్వీసు బ్లాకులు రాష్ట్రానికి కేటాయించబడగలవని తెలుస్తున్నది.

27. రాబోయే ఐదేండ్ల రాష్ట్రాభివృద్ధి వివిధ కార్యక్రమాలను కొంతవరకు సమీక్షించాను. ఇదివరకే నేను సూచించిన విధంగా యీ బృహత్కార్యక్రమము మనం సమకూర్చుకోగల ధన సంపత్తిమీద ఆధారపడి ఉంది. ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం పరిస్థితులను సమీక్షించుకుంటూ, మనకు లభ్యముకాగల సాధన సంపత్తితో, యీ కార్యక్రమాన్ని ఉచితరీతిగా సమన్వయ పరచుకుంటూ ఉండాలి.

1956-57 వ సం॥పు బడ్జెట్ అంచనా.

1956—57 28. ఆదాయ వ్యయాలు యిలా ఉంటవి.

| | | | రు. లక్షలలో. |
|---|---|---|---|
| ఆదాయము | ... | ... | 23,71.42 |
| వ్యయం | ... | ... | 26,95.49 |
| లోటు | ... | ... | 3,24.07 |

1955-56 సవరించిన అంచనాతో పోల్చినట్లయితే, 1956-57 బడ్జెటు ఆదాయంలో రూ 131.86 లక్షలు, వ్యయంలో రూ 58.43 లక్షలు హెచ్చు కనిపిస్తున్నది.

ఆదాయంలో పెరుగుదల ముఖ్యముగా యూనియన్ ఎక్సైజుపన్నులు, భూమిశిస్తు, అమ్మకంపన్ను, పొగాకుపన్నులద్వారా కలుగుతున్నది. ఆదాయపు పన్ను పద్దుక్రిందవచ్చిన తరుగువల్ల యిది కొంతవరకు తగ్గిపోయింది. ప్రధానంగా వరద మరమ్మతుల మూలంగా నీటి పారుదల పద్దుక్రింద, గ్రామీణ ప్రాంతాల్లోని జాతీయ నీటి సప్లయి ప్రణాళికలక్రింద ఎక్కువమొత్తం కేటాయించబడినందున వైద్యం, ప్రజారోగ్యశాఖల పద్దులక్రింద, 1955-56 లో తీసుకున్న అప్పులమీద వడ్డీకిగాను కేటాయింపు చేసినందున ఋణాల వడ్డీపద్దు క్రింద, ఖర్చులో హెచ్చు సంభవించింది.

నూతన పథకాలు 29. వచ్చే సంవత్సరం బడ్జెట్‌లో కేటాయించబడిన క్రొత్తస్కీముల జాబితా బడ్జెట్ మెమోరాండం ఒకటో అనుబంధములో యివ్వబడింది. వాటిలో కొన్ని ప్రధానమైన స్కీములను గురించి నేను ప్రస్తావిస్తాను. విద్యారంగంలో యీ క్రింది వాటికి అవకాశం చూపబడింది.—(1) ఈ సంవత్సరం క్రొత్తగా ప్రారంభించిన ఇంజనీరింగ్ కళాశాల ఖర్చులక్రింద ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రూ. 8.75 లక్షల గ్రాంటు, (2) క్రొత్తగా హైయర్ ఎలిమెంటరీ పాఠశాలలు, మాధ్యమిక పాఠశాలలు, బేసిక్ పాఠశాలలు ప్రారంభించడానికి రూ. 8 లక్షలు (3) కాకినాడ, అనంతపురములలో ఇంజనీరింగు కళాశాలల్లో డిప్లొమా కోర్సులకు

రూ. 3.89 లక్షలు, ప్రజారోగ్యం పద్దుక్రింద అదనంగా రెండు మలేరియా కంట్రోలు యూనిట్ల నిర్మాణానికై రూ. 1.02 లక్షలు కేటాయించబడింది. పశువైద్యం పద్దుక్రింద "రిండర్ పెస్ట్" వ్యాధి నిర్మూలన పైలట్ ప్రణాళికక్రై రూ. 4.57 లక్షలు కేటాయించబడింది. సహకారం పద్దుక్రింద గ్రామీణ పరపతి సంఘాల అభివృద్ధి విస్తరణ నిమిత్తం బడ్జెట్‌లో అవకాశం చూపబడింది (రూ. 2.03 లక్షలు). వ్యవసాయంక్రింద వ్యాధులు, తెగుళ్లు నిర్మూలనానికిగాను రూ. 1.27 లక్షలు, వ్యవసాయ పరికరాల, తేనెపట్టుల కొనుగోలు, పంపకం నిమిత్తం రూ. 1.04 లక్షలు కేటాయించబడింది. సిబ్బందికి కరువుభత్యం యిచ్చేందుకు స్థానిక సంస్థలకు గ్రాంట్ల క్రింద రూ. 5.00 లక్షలు, గ్రామాల రాకపోకల సౌకర్యాలకై రూ. 3.01 లక్షలు, ప్రధాన జిల్లా రోడ్ల పరిరక్షణకై రూ. 5.50 లక్షలుకూడా బడ్జెట్‌లో కేటాయించబడినవి.

30. ఈ క్రింది పన్నులు వసూలు చేయడానికై చేసిన శాసనాలు (చేయ కొత్తపన్నులు: శాసనాలు: బడినవి)—

| | | | సంవత్సరానికి వచ్చే ఆదాయం అంచనా రూ. లక్షలలో. |
|---|---|---|---|
| 1 | ఈనాం భూములమీద పూర్తి శిస్తు | .... | 46 |
| 2 | మిల్లుగుడ్డ, విలువైన రాళ్ల అమ్మకము మీద అదనపు పన్ను (సింగిల్ పాయింట్). | ... | 50 |
| 3 | ముడి పొగాకుమీద కొనుగోలు పన్ను, బీడీలు వగైరా తయారైన చౌక రకం పొగాకుమీద అమ్మకము పన్ను ఇవన్నీ అంచనాలే తప్ప యింత వస్తుందని అనుకోడానికి వీల్లేదు కొన్నికొన్ని తగ్గిపోవచ్చు కూడా. | ... | 60 |
| 4 | భూమి శిస్తుమీద సర్‌చార్జి | ... | 45 |
| 5 | కోర్టుఫీజు, దావాల విలువ ప్రమాణాలను మార్చినందువల్ల | ... | 15 |
| | | | 216 |

భూమి శిస్తుమీద సర్‌చార్జి తాత్కాలికంగా ఒక సంవత్సర కాలంమాత్రమే అమల్లో వుంటుంది. అనంతరం భూమిశిస్తు స్థిరీకరణ ప్రణాళిక అమలు పరచబడుతుంది. నీటి తీరువా రేట్లు పెంచబడుతవి. ఈ రెంటివల్ల సంవత్సరానికి రూ. 45 లక్షలు పైగానే ఆదాయము వస్తుందని భావించబడుతున్నది.

పైన సూచించిన శాసనచర్యలేగాక లక్ష రూపాయల విలువకు పైబడిన ఇరిగేషన్ వసతులద్వారా లాభంపొందిన భూములమీద అభివృద్ధిపన్ను విధించడానికీ, యిటీవల పూర్తిఅయినయిరిగేషన్ సౌకర్యాలుపొందుతున్నభూములమీద నిర్బంధ నీటి తీరువా సెస్సు విధించడానికీ, అధికారం యిచ్చే శాసనాలుకూడా చేయబడినవి. ద్వితీయప్రణాళికా కాలములో రెండో సంవత్సరంనుండిమాత్రమే యీ శాసనాలవల్ల ఆదాయం లభిస్తుందని అనుకుంటున్నాం. అడవులనుండి వచ్చే ఆదాయములో తప్ప,—అదీ చాల పరిమితం—పన్నులు వేయకుండా యితర విధాల ఆదాయాన్ని పెంపొందింప జేసుకొనే అవకాశాలు మనరాష్ట్రంలో చాలా తక్కువ. అడవుల విషయంలోకూడా వీలైన పద్ధతుల్లో ఆదాయాన్ని పెంచడానికి వీలైనప్పుడల్లా చర్యలు తీసుకొనబడినవి.—ఉదా: పుల్లరిరేట్లు పెంచడంద్వారా స్థానిక సంస్థల ఆర్థిక వసతులను అభివృద్ధి చేయడానికై స్థిరాస్థి మార్పు సందర్భంలో స్టాంపు డ్యూటీమీద విధింపబడుతున్న సర్‌చార్జీ రేట్లు యిటీవలనే పెంచబడినవి. అమ్మకంపన్ను వసూలు విధానాన్ని పరిశీలించడానికి, ముఖ్యంగా పన్ను ఎగవేత సమస్యను పరిశీలించడానికి ఒక సంఘం నియమించబడింది. ఆ సంఘంవారి సిఫార్సులు అందగానే అమ్మకంపన్ను చట్టాన్ని ఉచిత రీతిని సంస్కరించడానికి చర్యలు తీసుకుంటాము. చెరకుసెస్సు రేట్లను టన్నుకు రూపాయి నుండి మూడు రూపాయలకు పెంచాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయంవల్ల అదనంగా యేడాదికి సుమారు రూ. 12 లక్షలు వస్తుందని ఆశిస్తున్నాము. ఒక నిధిని యేర్పాటుచేసి, సెస్సు ఆదాయాన్ని దానిక్రింద జమకట్టాలని అభిప్రాయ పడుతున్నాము. చెరకు వ్యవసాయాభివృద్ధికై అమలుపరచబడే స్కీములమీద ఖర్చులన్నీ, యీ నిధినుండి పెట్టబడతై, పెట్రోలు మినహా యితర మోటారు స్పిరిట్‌మీద పన్ను రేటు గాలను 1-కి 0-1-6 నుండి 0-3-0 లకు పెంచాలని కూడా ప్రతిపాదన మొన్ననే జరిగిపోయింది. ఈ చర్యవల్ల సంవత్సరానికి అదనంగా మరొక రూ 9 లక్షలు ఆదాయం లభించవచ్చు.

పెట్టుబడి ఖర్చు.

31. ఈ క్రింద చూపించిన విధంగా వచ్చే సంవత్సరం బడ్జెట్‌లో పెట్టుబడి ఖర్చులక్రింద రూ. 15.48 కోట్లు కేటాయించబడింది.

| | | రూ. లక్షలలో. |
|---|---|---|
| 65 జమీందారీ రద్దుక్రింద భూస్వాములకు నష్ట పరిహారం | .... | 20.40 |
| 68 నీటి పారుదల ప్రణాళికలు | ... | 440.29 |
| 70 ప్రజారోగ్య విధానాల అభివృద్ధిక్రింద పెట్టుబడి ఖర్చు | ... | 41.04 |
| 71 వ్యవసాయ అభివృద్ధి; పరిశోధన ప్రణాళికల పెట్టుబడి ఖర్చు | .... | 30.39 |
| 72 పారిశ్రామికాభివృద్ధి పెట్టుబడి ఖర్చు | .... | 19.91 |
| 80 (ఎ) సకలార్థ సాధక నదీ ప్రణాళికల (నాగార్జున సాగర్) పెట్టుబడి ఖర్చు | .... | 180.00 |
| 81. సివిల్ నిర్మాణాల పెట్టుబడి ఖాతా | ... | 181.68 |
| 81(ఎ) విద్యుచ్ఛక్తి ప్రణాళికల పెట్టుబడిఖర్చు | .... | 569.46 |

| | | రూ. లక్షలలో. |
|---|---|---|
| 82. ఇతర పనుల పెట్టుబడి ఖర్చు | .... | 22.04 |
| 83. పెన్షన్ల తగ్గింపు విలువ .... | .... | 6.05 |
| 85-ఎ. ప్రభుత్వ వ్యాపార ప్రణాళికలమీద పెట్టుబడి ఖర్చు | .... | 85.72 |
| మొత్తం పెట్టుబడి పద్దు | .... | 1,547.88 |

1956-57 వ సంవత్సరం బడ్జటు అంచనాలో యీ క్రింది నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రణాళికల నిమిత్తం సొమ్ము కేటాయించబడింది.

| | | | 1956—57 వ సం॥పు బడ్జెటు అంచనా రూ. లక్షలలో. |
|---|---|---|---|
| సకలార్థ సాధక నదిలోయ ప్రాజెక్టులు— | | | |
| (నాగార్జున సాగర్ ప్రాజెక్టు). | .... | .... | 180.00 |
| నీటి పారుదల— | | | |
| తుంగభద్ర .... | .... | .... | 69.27 |
| కృష్ణారెగ్యులేటర్—వంతెన | .... | .... | 82.27 |
| కర్నూలు—కడప కాలువ | .... | .... | 149.61 |
| ఎగువ పెన్నా ప్రాజెక్టు | .... | .... | 3.76 |
| భైరవానితిప్ప ప్రాజెక్టు | .... | .... | 33.50 |
| రాళ్లపాడు ప్రాజెక్టు (రెండవ దశ) | .... | ... | 4.28 |
| ఇామప్రాంతాల్లో ఇతర నీటి పారుదల ప్రణాళికలు | | .... | 59.94 |
| స్పెషల్ మైనర్ ఇరిగేషన్ కార్యక్రమం | .... | .... | 3.12 |
| ఇతర పనులు | .... | .... | 24.29 |
| పెన్షన్, ప్రో—రేటా చార్జీలు | .... | .... | 10.30 |
| | మొత్తం | .... | 440.29 |
| విద్యుచ్ఛక్తి— | | | |
| మాచ్ ఖండ్ .... | .... | .... | 311.02 |
| తుంగభద్ర .... | .... | .... | 175.28 |
| చిత్తూరు .... | .... | .... | 39.49 |
| నెల్లూరు .... | .... | .... | 43.67 |
| | మొత్తం | .... | 569.46 |

ఇతర పెట్టుబడి పద్దులక్రింద కొన్ని క్రొత్తస్కీముల నిర్వహణకుకూడా సొమ్ము కేటాయించబడింది. వాటిలో ముఖ్యమైనవి ఏవంటే, వ్యవసాయం పద్దు క్రింద (1) వ్యవసాయదారులకు కిరాయి—కొనుగోలు పద్ధతిమీద ట్రాక్టర్లు, ఆయిల్ ఇంజన్లు, ఎలెక్ట్రిక్ మోటార్లు సప్లయి నిమిత్తం రు. 20.50 లక్షలు, (2) గొట్టపు బావుల నిర్మాణంనిమిత్తం రు. 1,37 లక్షలు కేటాయింపబడినవి. జిల్లా బోర్డులనుండి స్వాధీనం చేసుకునే రోడ్డు మార్గాలను బాగుపరచడానికి ఖర్చులకుగాను రూ. 11 లక్షలు కేటాయించబడింది. ఈ క్రింది ప్రణాళికలకు చిహ్న ప్రాయంగా ఒక్కొక్కదానికి రూ. 100 లు సొమ్ము కేటాయింపు జరిగింది. 1. రాష్ట్రీయ వేర్ హౌసింగ్ సంస్థ నిర్మాణానికి, 2. తాడిపత్రిలో ప్రారంభింపబోయే సహకార నూలుమిల్లు మూలధనం వాటాలనిమిత్తం, 3. సహకార పంచదార ఫ్యాక్టరీల మూలధనం వాటాలనిమిత్తం, 4. అనంతపురంలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో నూతన భవన నిర్మాణార్థం.

32. వచ్చే సంవత్సరం బడ్జెటులో, ముఖ్యమైన ఈ క్రింది అప్పులు అడ్వాన్సుల పద్దుల క్రింద సొమ్ము కేటాయింపు జరిగింది.

అప్పులు, అడ్వాన్సులు,

| | | 1956—57 వ సం॥పు బడ్జెటు అంచనా, రూ, లక్షలలో. |
|---|---|---|
| 1. | రైతులకు అడ్వాన్సులు .... .... | 101.24 |
| 2. | రసాయనిక ఎరువుల కొనుగోలు నిమిత్తం అప్పులు | 125.00 |
| 3. | నీటి సప్లయి, మురుగునీటి సౌకర్య ప్రణాళికలు, యితర పనుల నిర్వహణకై పురపాలక సంఘాలకు అప్పులు. | 72.22 |
| 4. | ఆంధ్రరాష్ట్ర కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకుకు స్వల్పకాలిక ఋణాలు. | 45.00 |
| 5. | చేనేత సహకార సంఘాలకు అడ్వాన్సులు. | 31.94 |
| 6. | కమ్యూనిటీ డెవలప్ మెంటు ప్రాజెక్టులు, బ్లాకులు, ఎన్. ఇ. ఎస్. బ్లాకులక్రింద అప్పులు. | 90.91 |
| 7. | ఇతర పద్దులు ... .... | 19.83 |
| | మొత్తం .... | 486.14 |

ఈ క్రింది ప్రయోజనాల నిమిత్తం వచ్చే సంవత్సరంలో కేంద్రప్రభుత్వం వద్దనుండి మొత్తం రూ. 15.91 కోట్లు అప్పుగా లభిస్తుందని అనుకుంటున్నాం. కాని అది సిద్ధించేమార్గంమాత్రం కనపడడములేదు.

| | | 1956—57 వ సంగు బడ్జెట్ అంచనా, రూ, లక్షలలో, |
|---|---|---|
| 1. అమోనియం సల్ఫేట్ కొనుగోలు, పంపకం | .... | 301.65 |
| 2. క్షామప్రాంతాల నీటిపారుదల పనులు | .... | 146.00 |
| 3. నీటి సప్లయి, మురుగునీటి ప్రణాళికలకై పురపాలక సంఘాలకు ఋణాలు. | .... | 72.22 |
| 4. గోస్తనీ నీటిసప్లయి ప్రణాళిక | .... | 41.04 |
| 5. అధికాహారోత్పత్తి ప్రణాళికలు | .... | 48.69 |
| 6. స్పెషల్ మైనర్ ఇరిగేషన్ కార్యక్రమము | .... | 14.29 |
| 7. చేనేత సెస్సునిధినుండి ఋణాలు | .... | 31.94 |
| 8. కమ్యూనిటీ ప్రాజెక్టులు, కమ్యూనిటీ డెవలప్‌మెంటు, జాతీయవిస్తరణ సేవా కార్యక్రమము. | .... | 91.28 |
| 9. నాగార్జున సాగర్ ప్రాజెక్టు | .... | 180.00 |
| 10. ప్రత్యేక అభివృద్ధి నిధి .... | .... | 669.07 |
| మొత్తం | .... | 1,591.13 |

వివిధ ప్రయోజనాల నిమిత్తం కేంద్రప్రభుత్వంనుండి తీసుకున్న అప్పులు తిరిగి చెల్లించేందుకు బడ్జెట్‌లో అవకాశం చూపించబడింది. ఇందులో ముఖ్యమైనవి ఏవంటే 1. రసాయనిక ఎరువుల కొనుగోలు నిమిత్తం అప్పులు (రూ. 322.50 లక్షలు,) 2. సమానపు చెల్లింపు విధానంమీద తీసుకొన్న అప్పుల అసలుక్రిందికి దఫాలవారి చెల్లింపులు (రూ. 98.60 లక్షలు) 1956 వ సంగు మద్రాసు ప్రభుత్వ 3% ఋణంలో మన ప్రభుత్వం చెల్లించవలసిన వాటా (రూ. 45.04 లక్షలు)

ఆర్థికావకాశాలు.

33. కేంద్రప్రభుత్వంనుండి తీసుకొనే అప్పుల విషయంలో పైన పేర్కొనబడిన మొత్తాల దృష్ట్యా పరిశీలిస్తే, పెట్టుబడి ఖర్చు, అప్పులు అడ్వాన్సుల ఖాతా, కేంద్రానికి తిరిగి చెల్లించవలసిన అప్పులు, వగైరా వ్యవహారాలలో మన ఆర్థిక పరిస్థితి యీ క్రిందివిధంగా ఉంటుంది:—

| | | రూ, లక్షలలో |
|---|---|---|
| 1. ప్రారంభపు నిల్వ | .... | 58.13 |
| 2. రివిన్యూ ఖాతా లోటు | .... | 324.07 |
| 3. పెట్టుబడి ఖర్చు | .... | 1,547.88 |
| 4. కేంద్రప్రభుత్వమునుండి అప్పులు | .... | 1,591.13 |
| 5. ప్రజలనుండి ఋణాలు | .... | 600.00 |

| | | రూ. లక్షలలో, |
|---|---|---|
| 6. కేంద్రప్రభుత్వానికి మద్రాసు ప్రభుత్వానికి అప్పులు తిరిగి చెల్లింపు. | .... | 466.14 |
| 7. రాష్ట్ర ప్రభుత్వం యిచ్చే అప్పులు అడ్వాన్సులు (నికరం) | .... | 183.31 |
| 8. ఇతర బాకీలు, డిపాజిట్లు, పద్దులు నికరం | .... | + 10.15 |
| ముగింపు నిల్వ | .... | -266.99 |

వచ్చే సంవత్సరం ఏప్రిల్ 1వ తేదీనాటికి మన **Ways and means position** మైనస్ బాలన్సులో ఉంటుంది.

34. భారత రాజ్యాంగంలో 280 (1) సూత్రం ప్రకారం ఏర్పడవలసిన మరో ఆర్థిక కమీషన్ 1956—57 లో నియమింపబడవలసి ఉంది. అధ్యక్షుని నియామకంకూడా అప్పుడే జరిగిన విషయం గౌరవనీయ సభ్యులకు తెలుసుగదా! సాంఘిక సేవా కార్యకలాపాల స్థాయిని పెంచుకునే ప్రయత్నంలో పెరిగిపోతున్న రాష్ట్రాల ఆర్థిక భారాన్నిగురించి కమిషన్ సమగ్రంగా పరిశీలించగలదనీ, కమిషన్ చేయబోయే సిఫార్సులమూలంగా రాష్ట్రాల ఆదాయం ఇతోధికంగా పెరగగలదనీ విశ్వసిస్తున్నాను. గౌరవనీయ సభ్యులు నా అభిప్రాయంతో ఏకీభవిస్తారని భావిస్తున్నాను. ఆర్థిక కమీషన్,—

35. 30 వ పేరాలో సూచించబడినట్లుగా క్రొత్త పన్నుల శాసనాలుచేసి నప్పటికీ రెవిన్యూఖాతాలో యింకా రూ. 324 లక్షలు లోటు కనిపిస్తూనే ఉంది. ఇప్పటికే రూ. 267 లక్షలు అధికంగా వ్యయంచేశాం. రెవిన్యూ పద్దుక్రింద లోటును భర్తీచేయడానికై ఇంకా ఇతర చర్యలను తీసుకోవడం తప్పనిసరి అవుతున్నది. ఇంతకుముందు నేను ప్రస్తావించిన అమ్మకం పన్ను పరిశీలన సంఘపు నివేదిక 1956 ఏప్రిల్ చివరకు అందవచ్చు. ఈ కమిటీ సిఫార్సులమూలంగా అమ్మకం పన్నుమీద రాబడి చాలావరకు పెరుగుతుందని విశ్వసిస్తున్నాం. ఇదే కాకుండా, ప్రభుత్వ ఆదాయాన్ని అభివృద్ధి చేసుకునేందుకై యితర చర్యలను గురించికూడా పరిశీలన చేయక తప్పకపోవచ్చు. రాష్ట్రాదాయాన్ని అభివృద్ధిచేసి, ఆర్థిక సామర్థ్యాన్ని సాధించుకొనడానికై చేయబడే, ప్రభుత్వ ప్రయత్నాలకు ప్రజా ప్రతినిధులైన అందరి సంపూర్ణ సహకారాన్ని అభ్యర్థిస్తున్నాను. పన్నులు మరి కొన్ని చర్యలు.

36. ఈ సంవత్సరం మన నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రణాళికల నిర్వహణకు యితోధిక సహాయంచేసిన కేంద్ర ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యులు శ్రీ చింతామణి దేశముఖ్ గారికీ, మనం ఆర్థికంగా గడ్డు పరిస్థితులను ఎదుర్కొనవలసివచ్చినప్పుడు మనకు సమయానికి సహాయముచేసి ఆదుకున్న రిజర్వు బ్యాంకువారికీ, యీ అవకాశాన్ని పురస్కరించుకుని మన హృదయపూర్వక కృతజ్ఞతను ప్రకటిస్తున్నాను.

37. నిరంతర అప్రమత్తతతో మన రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని స్థిరంగా నిలుపుతూ, పొదుపువిధానములగురించి ఆర్థికఅవకాశాలను పెంపొందించుకొనడంలోను మనకు సలహాలను యిచ్చి, తోడ్పడిన ఆర్థిక శాఖా కార్యదర్శి శ్రీ వి. కె. రావుగారి సామర్థ్యాన్ని ప్రశంసిస్తున్నాను.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పటినుండి ప్రశంసాపూర్వకంగా సేవచేసిన డిప్యూటీ కార్యదర్శి శ్రీ టి. ఇ. వీరరాఘవాచారిగారినికూడా అభినందిస్తున్నాను.

**Mr. SPEAKER :— The House will now adjourn and meet again at 8-30 a. m. on Monday the 5th March, 1956.**

**The House then adjourned.**

## అనుబంధములు.

అనుబంధము 1.

1953—54 వ సం॥ (ద్వితీయార్థము) నుండి 1956—57 వ సం॥కు ఆర్థిక స్థితిగతుల సంగ్రహ నివేదిక.

అనుబంధము 2.

రెవిన్యూ ఖాతాలో ఆదాయ వ్యయాల సమీక్ష.

అనుబంధము 3.

ఋణ పరిస్థితి నివేదిక.

అనుబంధము 4.

ఋణాల చెల్లింపు నివేదిక.

అనుబంధము 5.

ప్రథమ పంచవర్ష ప్రణాళికనుంచి సంగ్రహ నివేదిక.

అనుబంధము 6.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికనుంచి సంగ్రహ నివేదిక.

# ఒకటో అనుబంధం

1953—54 (ద్వితీయార్థం) నుండి 1956—57 వరకు ఆంధ్రరాష్ట్ర ఆర్థిక స్థితిగతుల సంగ్రహ నివేదిక.

| (1) | 1953—54 ద్వితీయార్థంలో లెక్కలు (2) రు. లక్షలలో. | 1954—55 లెక్కలు. (3) రు. లక్షలలో. | 1955—56 సవరించబడిన అంచనా. (4) రు. లక్షలలో. | 1956—57 బడ్జెట్ అంచనా. (5) రు. లక్షలలో. |
|---|---|---|---|---|
| ప్రారంభపు నిల్వ (క) .... | 1.00 | 8,00.34 | 85.87 | 53.13 |
| రెవిన్యూ పద్దు : | | | | |
| ఆదాయం ... | 11,29.89 | 19,82.35 | 22,39.56 | 23,71.42 |
| వ్యయం .... | 12,48.77 | 25,00.02 | 26,37.06 | 26,95.49 |
| లోటు (గ) .... | 1,18.88 | 5,17.67 | 3,97.50 | 3,24.07 |
| పెట్టుబడి ఖర్చు. | | | | |
| ప్రభుత్వ వ్యాపార ప్రణాళికలు .... మినహా పెట్టుబడి ఖర్చు | 3,68.73 | 12,57.23 | 14,94.51 | 15,12.16 |
| ప్రభుత్వ వ్యాపార ప్రణాళికలు .... | —1,51.30 | —40.42 | 59.34 | 35.72 |
| మొత్తము (చ) .... | 2,17.43 | 12,16.81 | 15,53.85 | 15,47.88 |
| అప్పులు, అడ్వాన్సులు (యిచ్చిన నికర మొత్తాలు) (జ) | 5.96 | 1,46.75 | 1,89.24 | 1,83.31 |
| ప్రజా ఋణం. | | | | |
| కేంద్రప్రభుత్వమునుండి తీసుకున్న ఋణాలు | 6,85.65 | 13,62.35 | 17,70.54 | 15,91.13 |
| ప్రజలనుండి సేకరించిన బహిరంగ ఋణాలు | 2,45.49 | — | 4,95.93 | 6,00.00 |
| ఇందులో తిరిగి చెల్లించినవి తీసివేయగా.... | —15.03 | —3,28.23 | —1,45.51 | —4,73.58 |
| నికరం (ట) .... | 9,16.11 | 10,34.02 | 21,20.96 | 17,17.55 |
| అవసర (కంటిన్జెన్సీ) నిధి (డ) .... | 40.00 | —2.65 | 2.65 | — |
| ఇతర ఋణాలు, డిపాజిట్లు, చెల్లింపులు.... వగైరా వ్యవహారాలు (త) | 1,80.50 | 1,35.39 | —15.76 | 17.59 |
| ముగింపు నిల్వ (ద) .... [(క)+(ట)+(డ)+(త)—(గ) —(చ)—(జ)] | 8,00.34 | 85.87 | 53.13 | —2,66.99 |

# రెండో అనుబంధం

## రెవిన్యూ ఖాతాలో ఆదాయ వ్యయాల

### స మీ క్ష.

### 1 ఆ దా య ం.

| పద్దుల వివరము. (1) | 1953—54 (త్రైమాసికం) లెక్కలు. (2) రు. లక్షలలో. | 1954—55 లెక్కలు. (3) రు. లక్షలలో. | 1955—56 సవరించబడిన అంచనా. (4) రు. లక్షలలో. | 1956—57 బడ్జెట్ అంచనా. (5) రు. లక్షలలో. | 5 వ కాలములోని అంకెల మొత్తము ఆదాయంలో ఎంతశాతము (6) రు. |
|---|---|---|---|---|---|
| 1. ఆదాయపుపన్ను, యూనియన్ ఎక్సైజుపన్నులు, ఎస్టేటుడ్యూటీ మొ॥ కేంద్రప్రభుత్వాదాయాల నుండి వచ్చే వాటా. | 2,22.46 | 4,24.61 | 4,36.29 | 4,31.08 | |
| | 2,22.46 | 4,24.61 | 4,36.29 | 4,31.08 | 18.1 |
| 2. ప్రధానమైన ఆదాయపుపద్దులు: | | | | | |
| భూమి శిస్తు (నీటి పారుదలవల్ల వచ్చే ఆదాయంతోసహా) .... | 3,96.50 | 4,70.26 | 5,10.90 | 5,68.90 | |
| రాష్ట్ర ఎక్సైజు పన్నులు .... | 2.37 | 7.08 | 7.17 | 7.12 | |
| స్టాంపులు .... | 98.15 | 1,54.13 | 1,60.85 | 1,75.85 | |
| అడవులు .... | 19.56 | 38.67 | 42.89 | 43.51 | |
| రిజిస్ట్రేషన్ .... | 13.27 | 33.33 | 32.02 | 33.02 | |
| మోటారుబండ్లమీద రాబడి.... | 75.27 | 1,58.72 | 1,61.81 | 1,16.34 | |
| ఇతర పన్నులు, సుంకాలు ; | | | | | |
| అమ్మకం పన్ను .... | 1,37.37 | 2,80.96 | 3,13.60 | 3,65.59 | |
| మోటారు స్పిరిట్ పన్నుల చట్టంక్రింద అమ్మకాలమీదరాబడి | 24.37 | 48.38 | 50.04 | 52.04 | |
| **ఇతర పద్దులు** .... | 21.82 | 48.89 | 54.50 | 57.34 | |
| .... | 7,88.68 | 12,40.42 | 13,33.78 | 14,65.21 | 61.8 |

| పద్దుల వివరము | 1953—54 (ద్వితీయార్థం) లెక్కలు. | 1954—55 లెక్కలు. | 1955—56 సవరింపబడిన అంచనా. | 1956—57 బడ్జెట్ అంచనా. | 5 వ కాలంలోని అంకెలు మొత్తము ఆదాయంలో ఎంత శాతము ? |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| | రు. లక్షలలో. | రు. లక్షలలో. | రు. లక్షలలో. | రు. లక్షలలో. | రు, |
| 3. విద్యుత్ప్రణాళికల మీద రాబడి :— (నిర్వహణ ఖర్చులుపోగా నికరం)— | 15.72 | 19.05 | 69.92 | 71.20 | |
| | 15.72 | 19.05 | 69.92 | 71 20 | 3.0 |
| 4. కేంద్ర ప్రభుత్వం నుండి గ్రాంటులు: | | | | | |
| అధికాహారోత్పత్తి, యితర అభివృద్ధి ప్రణాళికలు : | 21.26 | 24.43 | 20.79 | | |
| కమ్యూనిటీ డెవలప్ మెంటు ప్రాజెక్టులు, బ్లాకులు. | 2.38 | 20.48 | 33.54 | 30.16 | |
| స్థానిక అభివృద్ధి కార్యక్రమములు. | 8.29 | 16.31 | 66.00 | 35.00 | |
| జాతీయవిస్తరణ సేవా ప్రణాళికలు. | 7.48 | 1.56 | 10.51 | 41.72 | |
| రాజ్యాంగంలోని 275 సూత్రం ప్రకారం, షెడ్యూలు జాతుల సంక్షేమార్థమైన ప్రత్యేక అభివృద్ధి ప్రణాళికలకు గ్రాంట్లు : | 7.60 | 12.03 | 18.00 | 19.22 | |
| చేనేత సెస్సునిధినుండి గ్రాంట్లు : | 0.53 | 14.31 | * | * | |
| పంచవర్షప్రణాళికలో చేర్చబడిన నేరస్థ జాతుల ఉద్ధరణ, బోదకాలు నివారణ పథకాలు,విద్యాభివృద్ధి ప్రణాళికలు, గ్రామీణ ప్రాంతాలకు జాతీయనీటిసప్లయి, పారిశుద్ధ ప్రణాళికలు వగైరాల నిమిత్తం కేంద్రప్రభుత్వం యిచ్చే యితర గ్రాంటులు. | | | 37.80 | 47.22 | |
| | 47.54 | 89.42 | 1,86.64 | 1,73.32 | 7.4 |
| 5. ఇతర పద్దులక్రింద రాబడి .... | 86.93 | 2,08.85 | 2,12.93 | 2,30.61 | 9.7 |
| మొత్తం .... | 11,29.89 | 19,82.35 | 22,39.56 | 23,71.42 | 100 |

* ఈ గ్రాంట్లు 1955-56 నుండి ఆయా సర్వీసు పద్దులక్రింద ఖర్చు మినహాయింపు రూపంలో లెక్కించబడుతున్నవి.

I "అధికాహారోత్పత్తి, యితర అభివృద్ధి ప్రణాళికలు" పద్దులో యిది చేర్చబడింది.

## II రెవిన్యూ ఖాతాలో ఖర్చు.

| పద్దుల వివరము. (1) | 1953—54 (ద్వితీయార్ధం) లెక్కలు. (2) రు. లక్షలలో. | 1954—55 లెక్కలు. (3) రు. లక్షలలో. | 1955—56 సవరించబడిన అంచనా. (4) రు. లక్షలలో. | 1956—57 బడ్జెట్ అంచనా. (5) రు. లక్షలలో. | 5 వ కాలంలోని అంకెల మొత్తము ఆదాయంలో ఎంత శాతము? (6) రు. |
|---|---|---|---|---|---|
| 1. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలు: | | | | | |
| నీటి పారుదల .... | 77.12 | 1,68.25 | 1,54.32 | 1,44.39 | |
| విద్య .... | 2,47.34 | 4,49.02 | 4,65.16 | 4,64.67 | |
| వైద్య వసతి .... | 35.93 | 94.51 | 95.03 | 1,08.58 | |
| ప్రజారోగ్యం .... | 28.36 | 63.28 | 50.28 | 90.82 | |
| వ్యవసాయం .... | 42.18 | 76.59 | 81.00 | 87.19 | |
| పశువైద్యం .... | 9.47 | 22.70 | 29.00 | 28.22 | |
| సహకారం .... | 13.87 | 45.11 | 31.00 | 36.17 | |
| పరిశ్రమలు .... | 17.16 | 40.82 | 53 00 | 69.57 | |
| సివిల్ నిర్మాణాలు .... | 1,73.79 | 2,63.19 | 2,31.73 | 1,79.20 | |
| విద్యుచ్ఛక్తి .... | 66.32 | 1,01.65 | 94.23 | 1,00.58 | |
| జాతీయ వికాస కార్యక్రమం (కమ్యూనిటీ ప్రాజెక్టులు, కమ్యూనిటీ డెవలప్‌మెంటు స్థానిక అభివృద్ధి ప్రణాళికలు, జాతీయ విస్తరణ సర్వీసు బ్లాకులు) .... | 4.41 | 58.76 | 1,21.19 | 1,35.31 | |
| షెడ్యూలు జాతుల, కులాల సముద్ధరణ : | 33.40 | 1,01.08 | 1,00.02 | 87.50 | |
| మొత్తం .... | 7,49.35 | 14,84.96 | 15,05.96 | 15,33 20 | 53.4 |
| 2. ఆదాయంమీద ప్రత్యక్ష ఖర్చులు : (లేక ప్రధానమైన ఆదాయం పద్దులకు చెందిన నిర్వహణ ఖర్చులు) | 1,04.01 | 2,26.65 | 2,49.18 | 2,57.89 | 9.0 |
| 3. ఇతర పద్దులు : | | | | | |
| పరిపాలన, న్యాయ నిర్వహణ, పోలీసు వగైరా | 4,85.20 | 9,75.62 | 10,58.66 | 10,78.21 | 37.6 |
| మొత్తం .... | 13,38.56 | 26,87.23 | 28,13.80 | 28,68 80 | 100 |

సూచన :— ఈ సంఖ్యలలో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రణాళికల నిర్వహణ ఖర్చులు చేరి వున్నవి.

| పద్దుల వివరము. | 1953—54 (ద్వితీయార్థం) లెక్కలు. | 1954—55 లెక్కలు. | 1955—56 వివరింపబడిన అంచనా. | 1956—57 బడ్జెట్ అంచనా. | 5 వ కాలంలోని అంకెల మొత్తము ఆదాయంలో ఎంత శాతము ? |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| | లక్షలలో. | లక్షలలో. | లక్షలలో. | లక్షలలో. | |
| రివిన్యూ ఖాతా వినా యితర పెట్టుబడి ఖర్చు : | | | | | |
| జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలు: | | | | | |
| నీటి పారుదల ... | 1,20.50 | 3,31.08 | 6,21.80 | 6,20.29 | |
| విద్యుచ్ఛక్తి .... | 1,73.52 | 7,26.54 | 6,28.90 | 5,69.46 | |
| పారిశ్రామికాభివృద్ధి. .... | 0.61 | 2.11 | 5.45 | 41.95 | |
| వ్యవసాయాభివృద్ధి: పరిశోధన. | .... | 48.17 | 40.00 | 30.39 | |
| సివిల్ నిర్మాణాలు .... | 67.05 | 1,18.51 | 1,23.69 | 1,81.68 | |
| ప్రజారోగ్య అభివృద్ధి .... | .... | .... | 46.77 | 41.04 | |
| మొత్తం .... | 3,61.68 | 12,26.41 | 14,66.61 | 14,84.81 | 95.9 |
| యితర సౌకర్యములు .... | 1,44.25 | 9.60 | 87.24 | 63.07 | 4 1 |
| పూర్తి మొత్తం. .... | 2,17.43 | 12,16.81 | 15,53.85 | 15,47.88 | 100 |

# మూడో అనుబంధం

## ఋణ పరిస్థితి నివేదిక.

### I. 1953 వ సం॥ అక్టోబరు 1 వ తేదీకి పూర్వం, ఉమ్మడి మద్రాసురాష్ట్రం చేసిన ఋణాలు.

| | 1953 వ సం॥ సెప్టెంబరు 30 వ తేదీనాటికి నిల్వ తేలిన మొత్తం. | ఆంధ్రరాష్ట్రం వాటా* (తాత్కాలికం) | 1956 వ సం॥ మార్చి 31 వ తేదీ నాటికి నిల్వ తేలిన మొత్తం. |
|---|---|---|---|
| | రూ. లక్షలలో. | రూ. లక్షలలో. | రూ. లక్షలలో. |
| 1. ప్రజలనుండి బహిరంగ ఋణాలు : | | | |
| (i) 1963 వ సం॥పు 4% మద్రాసు ఋణం | 10,33.04 | 3,07.00 | 11,28.93 |
| (ii) ఇతర బహిరంగ ఋణాలు. | 24,21.02 | 8,71.57 | |
| 2. కేంద్రప్రభుత్వంనుండి తీసుకున్న ఋణాలు | 56,49.46 | 21,36.96 | 20,41.82 |
| | 94,03.52 | 33,15.53 | 31,70.75 |

### II. 1953 వ సం॥ అక్టోబరు 1 వ తేదీనగాని, తరువాతగాని, ఆంధ్ర ప్రభుత్వం చేసిన ఋణాలు.

#### 1. బహిరంగ ఋణాలు.

| ఋణాన్ని ఎప్పుడు విడుదల చేసింది. | ఋణం వివరం. | విడుదల చేసిన మొత్తం. | 1956 వ సం॥ మార్చి 31 వ తేదీనాటికినిల్వ తేలగలమొత్తం | రిమార్కులు. |
|---|---|---|---|---|
| | | రూ. లక్షలలో. | రూ. లక్షలలో. | |
| 1955 వ సం॥ ఆగస్టు. | 1967 వ సం॥పు 4% ఆంధ్రరాష్ట్ర అభివృద్ధి ఋణం. | 4,95.93 | 4,95.93 | ఇండియా రిజర్వు బ్యాంకువారివద్ద నుండి తుది లెక్కలు రావాలి. |

* ఉమ్మడి మద్రాసురాష్ట్ర ప్రజా ఋణాలను, విభజన ఫలితంగా ఏర్పడిన మూడు రాష్ట్రాల మధ్య కేటాయింపు పూర్తి పరిష్కారం జరిగేలోగా, జనాభా ప్రాతిపదికమీద తాత్కాలిక కేటాయింపు జరిగింది.

## 2. కేంద్రప్రభుత్వంనుండి తీసుకున్న ఋణాలు.

| ఋణం వివరం. | మొత్తం. | 1956 వ సం॥ మార్చి 31 వ తేదీ నాటికి మిగిలిన మొత్తం. | రిమార్కులు. |
|---|---|---|---|
| | రూ. లక్షలు. | రూ. లక్షలు. | |
| (1) | (2) | (3) | (4) |
| ( 1953–54 వ సంవత్సర ద్వితీయార్ధం ) | | | |
| 1. పట్టణ ప్రాంతాల యెరువుల వినియోగ ప్రణాళిక. | 0.38 | 0.24 | సంవత్సరానికి 3⅝% వడ్డీతో, 1955 వ సం॥ ఫిబ్రవరినుండి, ఐదు సమాన సంవత్సర వాయిదాలలో తీర్చాలి. |
| 2. చేనేత పరిశ్రమాభివృద్ధి (సెస్సు నిధినుండి ఋణం). | 16.21 | 7.71 | వడ్డీలేదు. రూ. 12.84 లక్షలు 5 సంవత్సర వాయిదాల్లోనూ, రూ 3.21 లక్షలు 2 సంవత్సర వాయిదాల్లోనూ, రూ. 0.16 లక్షలు ఒక సంవత్సరం లోగానూ తీర్చాలి. (1955 వ సం॥ నవంబరు 14 వ తేదీన తీర్చాము.) |
| 3. జాతీయ విస్తరణ సేవా కార్యక్రమం క్రింద 22 డెవలప్‌మెంటు బ్లాకులకు అప్పులుయిచ్చే నిమిత్తం. | 3.52 | 3.05 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 1955 వ సం॥ ఫిబ్రవరినుండి 12 సమాన సంవత్సరవాయిదాలలో తీర్చాలి. |
| 4. చిన్న ఓడరేవుల అభివృద్ధికి. | 0.17 | 0.17 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 18 సమాన సంవత్సర వాయిదాలలో తీర్చాలి. మొదటి 12 సంవత్సరాలకు వడ్డీలేదు. |
| 5. క్షామప్రాంతాల శాశ్వతాభివృద్ధి కార్యక్రమాలకు. | 4.00 | 4.00 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 1959-60 సంవత్సరంనుండి 25 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. మొదటి5సంవత్సరాలకువడ్డీలేదు. |
| 6. 1953-54 లో ఆమోదింపబడిన నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రణాళికల ఖర్చు నిమిత్తం. | 375.00 | 375.00 | సంవత్సరానికి 4% వడ్డీతో 1957-58 నుండి 7సమాన సంవత్సర వాయిదాలలో తీర్చాలి. తీసుకున్ననాటి నుండి వడ్డీ కట్టాలి. |
| 7. 1953 అక్టోబరు 1 వ తేదీ నాటికి ఆంధ్రరాష్ట్ర ప్రాంతంలో నిల్వఉన్న ఆహార ధాన్యాలు, ఎరువులు, పైపులు, ఫిట్టింగులు, యినుము, ఉక్కు, వగైరావస్తువుల విలువ. | ... | .... | వడ్డీ సంవత్సరానికి 3% చొ॥న 1954వ సం॥ అక్టోబరు 29వ తేదీన తీర్చబడింది. |
| స్వల్పకాలిక ఋణంగా భావించబడింది. | 189.91 | ... | 1954-55 లో తీర్చబడింది. |

| ఋణం వివరం. | మొత్తం. | 1956 వ సం॥ మార్చి 31 వ తేదీ నాటికి ఉన్న మిగిలి మొత్తం. | రిమార్కులు. |
|---|---|---|---|
| | రూ. లక్షలు. | రూ. లక్షలు. | |
| (1) | (2) | (8) | (4) |
| **1953–54 వ సంవత్సర ద్వితీయార్థం—శేషము.** | | | |
| 8. ఎరువుల కొనుగోలు, పంపకం నిమిత్తం ఋణం. | 25·62 | .... | సంవత్సరానికి 3½% వడ్డీ. 1954 వ సం॥ డిశంబరులో తీర్చబడింది. |
| 9. కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకు ఋణపత్రాల (డిబెంచర్ల) కొనుగోలు నిమిత్తం. | 8·46 | 8.46 | సంవత్సరానికి 4¾% వడ్డీతో 20 సంవత్సరాలలోగా తీర్చాలి. |
| 10. ఫిల్టర్ పాయింట్ల గొట్టపుబావుల నిర్మాణానికి. | 5.72 | 2·90 | సంవత్సరానికి4%వడ్డీతో 10 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 11. లిఫ్టు యిరిగేషన్ ప్రణాళికలు (కిరాయి కొనుగోలు పద్ధతి) | 6.81 | 4·98 | సంవత్సరానికి 4%వడ్డీతో10సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 12. ప్రత్యేక స్వల్ప నీటి పారుదల మైనర్ యిరిగేషన్ ప్రణాళికలు. | 35·27 | 31·74 | సంవత్సరానికి 4½%వడ్డీతో15సమాన సంవత్సర వాయిదాల్లోతీర్చాలి. |
| 13. పబ్లిక్ వర్క్సు నీటి పారుదల ప్రణాళికలు. | 6·12 | 5.51 | డిటో. |
| 14. లిఫ్టు యిరిగేషన్ ప్రణాళిక. | 1.65 | .... | సంవత్సరానికి 3%వడ్డీచొ॥ 1954వ సం॥ నవంబరు 6 వ తేదీన తీర్చబడింది. |
| 15. ట్రాక్టర్లతో క్రొత్తసాగు ప్రణాళికలు(కిరాయికొనుగోలుపద్ధతి) | 6.81 | 0.59 | సంవత్సరానికి 4%వడ్డీతో10సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 16. కర్నూలులో తాత్కాలిక రాజధాని నిర్మాణం. | 13·48 | 13.48 | సంవత్సరానికి 4¾%వడ్డీతో 15సంవత్సరాల అనంతరం తీర్చాలి. |
| **1954-55** | | | |
| 1. ప్రత్తిపంట విస్తరణ ప్రణాళిక. | 1.50 | .... | సంవత్సరానికి 2½% వడ్డీతో తీర్చబడింది. |
| 2. చేనేత పరిశ్రమాభివృద్ధి. | 27·66 | 22.98 | వడ్డీలేదు. 6 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 3. జాతీయ ప్రణాళికాఋణంలో వాటా. | 250·00 | 250.00 | 1956 అక్టోబరు 1 వ తేదీన తీర్చాలి. సంవత్సరానికి 3¾% చొ॥ ప్రతి అర్ధ సంవత్సరానికి వడ్డీ మాత్రమే చెల్లించాలి. |

| ఋణాల వివరం. | మొత్తం. | 1956వ సం॥ మార్చి 31 వ తేదీనాటికి నిల్వ బాకీల మొత్తం. | రిమార్కులు. |
|---|---|---|---|
| | రూ.లక్షలు. | రూ.లక్షలు. | |
| (1) | (2) | (3) | (4) |
| 4. 1954-55 సంవత్సరంలో రాష్ట్ర ప్రణాళికలోని అభివృద్ధి పథకాల నిర్వహణకై ప్రత్యేకాభివృద్ధి నిధినుండి తీసుకున్న ఋణం. | 600.00 | 600.00 | సంవత్సరానికి 4% వడ్డీతో, 1958-59 నుండి 7 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. తీసుకున్న నాటినుండి వడ్డీ కట్టుకోవాలి. |
| 5. చిన్నతరహా పరిశ్రమలకు అప్పులిచ్చేందుకు. | 2.00 | 1.83 | సంవత్సరానికి 3¾% వడ్డీతో 10 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 6. ఎరువులు కొనుగోలు, పంపకం నిమిత్తం. | 127.89 | 127.89 | సంవత్సరానికి 3⅛% వడ్డీతో అప్పుతీసుకున్న నాటినుండి 18 నెలల్లో తీర్చాలి. 1956వ సం॥ జూన్ 6వ తేదీన గాని, అంతకులోగాగాని తీర్చాలి. |
| 7. కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులు, జాతీయవిస్తరణసేవా కార్యక్రమాలు అమలుజరిగే ప్రాంతాలకుగాను అప్పులు. | 8.78 | 8.44 | సంవత్సరానికి 4⅛% వడ్డీతో 12సమాన సంవత్సరవాయిదాల్లో తీర్చాలి. |
| 8 చేనేత పరిశ్రమాభివృద్ధికి. | 2.78 | 1.69 | వడ్డీలేదు. రెండు సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. |
| 9 ట్రాక్టర్లతో క్రొత్తసాగు ప్రణాళికలు.కిరాయికొనుగోలుపద్ధతి | 25.00 | 22.92 | సంవత్సరానికి 4%వడ్డీతో 10సమాన సంవత్సరవాయిదాల్లో చెల్లించాలి. |
| 10 జాతీయ నీటి సప్లయి, పారిశుద్ధ్య ప్రణాళిక క్రింద అప్పు. | 25.00 | 24.59 | సంవత్సరానికి 4½%వడ్డీతో, 30సమాన సంవత్సరవాయిదాల్లో తీర్చాలి. |
| 11. చిన్న ఓడరేవుల అభివృద్ధికి | 1.83 | 1.83 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 18 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. మొదటి 12 సంవత్సరాలకు వడ్డీ లేదు |
| 12. నిరుద్యోగ నివారణార్థం, విద్యుచ్ఛక్తి సౌకర్య విస్తరణ ప్రణాళికలు. | 40.00 | 40.00 | సంవత్సరానికి 4½% వడ్డీలో 1960-61 నుండి 25 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. |
| 13. ఎరువులకొనుగోలు, పంపకం నిమిత్తం. | 77.11 | 77.11 | సంవత్సరానికి 3⅛% వడ్డీతో అప్పు తీసుకున్న తేదీనుండి 18 నెలల లోగా తీర్చాలి. 1956 వ సం॥ సెప్టెంబరు 30వ తేదీనగాని,అంతకు లోగాగాని చెల్లించవలసి వస్తుంది. |

| ఋణాల వివరం. | మొత్తం. | 1956వ సం॥ మార్చి 31వ తేదీనాటికి మిగిలిన మొత్తం. | రిమార్కులు. |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| | రూ.లక్షలు. | రూ.లక్షలు. | |
| 14. ఫిల్టరుపాయింట్ల గొట్టపు బావుల నిర్మాణానికి. | 12.50 | 4.61 | సంవత్సరానికి 4% వడ్డీతో, 10 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి |
| 15. లిఫ్ట్ యిరిగేషన్ ప్రణాళికలు (కిరాయి-కొనుగోలు పద్ధతి). | 10.00 | 6.44 | డిటో |
| 16. విజయవాడలో కుటీర పరిశ్రమల కేంద్ర విక్రయశాలను స్థాపించుటకు. | 0.20 | ... | సంవత్సరానికి 3½% వడ్డీతో, 1956వ సం॥ మార్చి 31 వ తేదీనగాని, అంతకు ముందుగాని చెల్లించాలి. |
| 17. జామ ప్రాంతాల శాశ్వతాభివృద్ధి ప్రణాళిక. | 70.00 | 70.00 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 1960-61 నుండి 25 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. మొదటి 5 సంవత్సరాలకు వడ్డీలేదు. |
| 18. ఆర్థికావకాశాల నిమిత్తం అడ్వాన్సు. | 80.00 | ... | సంవత్సరానికి 3% వడ్డీతో, 1955వ సం॥ మార్చి 31వ తేదీన చెల్లించబడింది. |
| | 1955—56. | | |
| 1. ఎరువుల కొనుగోలు, పంపకం, నిమిత్తం. | 49.20 | 49.20 | సంవత్సరానికి 3½% వడ్డీతో, అప్పు తీసుకున్న తేదీనుండి 18 నెలలలోగా చెల్లించాలి. 1956 వ సం॥ నవంబరు 28 వ తేదీనగాని అంతకు ముందేగాని చెల్లించవలసివస్తుంది. |
| 2. 1955—56 లో ఆమోదింపబడిన ప్రణాళికా పథకాల నిర్వహణ ఖర్చుల నిమిత్తం. | 700.00 | 700.00 | సంవత్సరానికి 4% వడ్డీతో, 1959-60 నుండి 7 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. అప్పు తీసుకున్న నాటినుండి వడ్డీ లెక్కకట్టుకోవాలి. |
| 3. వ్యవసాయ ప్రయోజనాలకై స్వల్ప, మధ్యకాలిక ఋణాలు. | 20.00 | 20.00 | సంవత్సరానికి 3½% వడ్డీతో, 5 సమాన సంవత్సరవాయిదాల్లో చెల్లించాలి. |
| 4. ప్రత్తిపంట విస్తరణ ప్రణాళిక నిమిత్తం అప్పు. | 0.50 | ... | సంవత్సరానికి 3% వడ్డీతో 1956 వ సం॥ మార్చి 31 వ తేదీనగాని, అంతకుముందేగాని చెల్లించాలి. |

| ఋణాల వివరం. | మొత్తం. | 1956 వ సం॥ మార్చి నెల 31 వ తేదీ నాటికి మిగిలిన మొత్తం. | రిమార్కులు. |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| | రూ. లక్షలు. | రూ. లక్షలు. | |
| 5. ఎరువుల కొనుగోలు, పంపకం నిమిత్తం. | 68.30 | 68.30 | సంవత్సరానికి 3⅛% వడ్డీతో, అప్పు తీసుకున్న తేదీనుండి 18 నెలల్లోగా చెల్లించాలి. 1957 వ సం॥ జనవరి 14వ తేదీనగాని, అంతకు ముందుగాని చెల్లించవలసివస్తుంది |
| 6. చేనేత పరిశ్రమాభివృద్ధికి. | 18.50 | 18.50 | వడ్డీలేదు. అప్పు తీసుకొన్న తేదీ తర్వాత రెండు సంవత్సరాల నుండి, 10 సమాన సంవత్సర వాయిదాలలో చెల్లించాలి. |
| | 3.10 | 3.10 | 10 సమాన వాయిదాల్లో చెల్లించాలి. ఇందులో 1.35 లక్షలకు వడ్డీలేదు. మిగిలిన 1.75లక్షలకు సంవత్సరానికి 4¼% వడ్డీ. |
| | 15.00 | 15.00 | వడ్డీలేదు. 5 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. |
| | 0.30 | 0.30 | వడ్డీలేదు. 2 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. |
| 7. పట్టణాల నీటి సప్లయి, మురుగు పారుదల ప్రణాళికలు. | 25.00 | 25.00 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 30 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 8. పట్టణప్రాంతాల యెరువుల విని యోగ ప్రణాళిక. | 1.00 | 0.74 | సంవత్సరానికి 4¼% వడ్డీతో, 15 సమానసంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. |
| 9. ఫిల్టర్ పాయింట్ల గొట్టపుబావుల నిర్మాణానికి. | 5.00 | 5.00 | సంవత్సరానికి 4% వడ్డీతో, 10 సమాన సంవత్సర వాయిదాల్లో తీర్చాలి. |
| 10. స్వల్పాదాయ వర్గాల గృహ నిర్మాణ ప్రణాళిక. | 10.00 | 10.00 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 30 సమాన సంత్సర వాయిదాల్లో చెల్లించాలి. మొదటి వాయిదా పైకం 1958 వ సం॥ ఆగస్టు 31వ తేదీన చెల్లించాలి. |
| 11. అధికాహారోత్పత్తి ప్రణాళికలు. | 9.59 | 9.59 | సంవత్సరానికి 4% వడ్డీతో, 10 సమాన సంవత్సర వాయిదాలో చెల్లించాలి. |

| | ఋణాల వివరం. | మొత్తం. | 1956 వ సం॥ మార్చి నెల 31 వ తేదీ నాటికి తేలగల మొత్తం. | రిమార్కులు. |
|---|---|---|---|---|
| | (1) | (2) | (3) | (4) |
| | | రూ. లక్షలు. | రూ. లక్షలు. | |
| 12 | భూమిసాగు (కాలొనైజేషన్) ప్రణాళిక | 0.51 | 0.51 | షరతులుయింకానిర్ణయంకాలేదు. |
| 13 | గ్రామ ప్రాంతాల శాశ్వతాభివృద్ధి | 1,60.00 | 1,60.00 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 1961-62 నుండి 25 సమాన సంవత్సర వాయిదాల్లోచెల్లించాలి. మొదటి 5 సంవత్సరాలకు వడ్డీలేదు. |
| 14 | నాగార్జునసాగర్ ప్రాజెక్టు | 60.00 | 60.00 | షరతులుయింకానిర్ణయంకాలేదు. |
| 15 | ప్రత్తిపంట విస్తరణ ప్రణాళికలు | 0.50 | 0.50 | సంవత్సరానికి 3% వడ్డీతో 18 నెలల్లోగా చెల్లించాలి. 1957వ సం॥ జూన్ 23 వ తేదీనగాని, అంతకు ముందుగా గాని చెల్లించవలసి వస్తుంది. |
| 16 | జాతీయవిస్తరణ సేవా కార్యక్రమం కమ్యూనిటీ ప్రాజెక్టులు, కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకుల నిమిత్తం | 26.71 | 26.71 | సంవత్సరానికి 4½% వడ్డీతో, 12 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి |
| 17 | చిన్న తరహా పరిశ్రమలకు అప్పులిచ్చేందుకు | 1.39 | 1.39 | సంవత్సరానికి 3% వడ్డీతో 10 సమాన సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి అప్పుతీసుకున్న తర్వాత రెండో సంవత్సరంలో మొదటి వాయిదాపైకం చెల్లించాలి, |
| | | 4.44 | 4.44 | సంవత్సరానికి 4% వడ్డీ |
| 18 | అనంతపురం, కాకినాడ, ఇంజనీరింగు కళాశాలా విద్యార్థులకు వసతిగృహాల నిర్మాణార్థం | 4.00 | 4.00 | వడ్డీలేదు. 33 సంవత్సర వాయిదాల్లో చెల్లించాలి. |
| 19 | ఎరువుల కొనుగోలు, పంపకం నిమిత్తం | 43.78 | 43.78 | సంవత్సరానికి 3¾%వడ్డీతో అప్పు తీసుకున్ననాటినుండి 18 నెలలలోగా తీర్చాలి 1957 వ సం॥ జులై 16 వ తేదీనగాని అంతకు ముందుగానిచెల్లించవలసివస్తుంది |
| 20 | యితర పద్దులు | 5,43.72 | 5,43.72 | 1955-56 సవరింపబడిన అంచనా ప్రకారం 1956 వ సం॥ మార్చి 31 వ తేదిలోగా తీసుకోదలచిన అప్పులు |
| | [2 వ పద్దులో 2] మొత్తం | 38,31.92 | 34,87.94 | |

# సంక్షిప్త సమీక్ష.

| | 1953 వ సం॥ నవంబరు 1 వ తేదీ ఉన్నట్టి మొత్తం. | 1953-54 నుండి 1955-56 వరకు చేసిన ఋణాలు. | 1956వ సం॥ మార్చి 31 తేదీ నాటికి ఉండగల మొత్తము. |
|---|---|---|---|
| | (1) | (2) | (3) |
| | రూ. లక్షలలో. | రూ. లక్షలలో. | రూ. లక్షలలో. |
| రాష్ట్రవిభజనాత్పూర్వ ఋణాలు. | | | |
| బహిరంగ ఋణాలు. | 11,78.57 | ... | 11,28.93 |
| కేంద్ర ప్రభుత్వ ఋణాలు. | 21,36.96 | ... | 20,41.82 |
| రాష్ట్రవిభజనానంతర ఋణాలు. | | | |
| బహిరంగ ఋణాలు. | ... | 4,95.93 | 4,95.93 |
| కేంద్ర ప్రభుత్వ ఋణాలు. | ... | 38,31.92 | 34,87.94 |
| | 33,15.53 | 43,27.85 | 71,54.62 |

# నాలుగో అనుబంధం.

## ఋణాల చెల్లింపు నివేదిక.

| (1) | 1953-54 (ద్వితీయార్థం) రూ. లక్షలలో. (2) | 1954-55 రూ. లక్షలలో. (3) |
|---|---|---|
| **I** కేంద్ర ప్రభుత్వమునుండి ఋణాలు : | | |
| 1. ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి యిచ్చిన అప్పుల బాపతు ఏటేటా చెల్లింపులు ... ... | 10.41 | 12.34 |
| 2. చేనేత పరిశ్రమాభివృద్ధి ... ... | .... | 4.33 |
| 3. అధికాహారోత్పత్తి ప్రణాళికలు ... ... | ... | 15.14 |
| 4. 1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్ర ప్రాంతంలో నిల్వ ఉన్న ఆహారధాన్యాలు, ఎరువులు, పైపులు, ఫిట్టింగులు, యినుము, ఉక్కు వగైరా వస్తువుల విలువ (స్వల్ప కాలిక ఋణం క్రింద భావించబడింది) ... | ... | 189.91 |
| 5. అమోనియంసల్ఫేట్ విలువ ... ... | ... | 25.62 |
| 6. జాతీయ వికాస కేంద్రాలు, జాతీయ విస్తరణ, సేవాకృషి, జాతీయ అభివృద్ధి బ్లాకులు ... ... | ... | 0.23 |
| 7. ఇండియా ప్రభుత్వం వద్ద ఆర్థికావకాశాల నిమిత్తం తీసుకున్న అడ్వాన్సులు ... ... | ... | 80.00 |
| 8. చిన్నతరహా పరిశ్రమలు ... ... | ... | ... |
| 9. నీటిసప్లయి, మురుగుపారుదల... ... | ... | ... |
| **I** వ పద్దు మొత్తం ... | 10.41 | 3,27.57 |
| **II** బహిరంగ ఋణాలు : | | |
| 1. రాష్ట్ర విభజనాత్పూర్వం చేసిన బహిరంగ ఋణాల అసలులో ఆంధ్ర ప్రభుత్వం వాటాక్రింద మద్రాసు ప్రభుత్వానికి చెల్లించినది. ... ... | 4.62 | 0.65 |
| **I, II** వ పద్దుల మొత్తం ... | 15.03 | 3,28.22 |

